# కవిగారి గజలు సుందరి

(గాలిబు మఱియు నూట పాతిక మంది
ఉరుదూ కవుల కవితల అనువాదాలు)

## కవిగారు

(ఆకునూరు గోపాలకిషన్ రావు)

విశ్వసాహితి
పోతుకూచి సరస్వతీ పీఠం.

# కవిగారి గజలు సుందరి

అనువాద

కవిత్వీకరణ

**'కవిగారు'**

(ఆకునూరు గోపాల కిషన్ రావు)


ప్రథమ ప్రచురణ

27 డిసెంబరు 1997

**500 కాపీలు**

డి.టి.పి

ఉత్తమ్ కంప్యూటర్ సర్వీసస్

99/ 3k i విజయనగర్ కాలనీ

హైదరాబాదు 500057 (A.P)

☎3341382

ప్రాసెసింగ్ & ప్రింటింగ్

శ్రీ సాంబ రత్న ప్రాసెస్

3-6-780 / 22 హిమాయత్‌నగర్

హైదరాబాదు - 500029.

☎7607900

వెల : రూ : 50.00

ప్రతులకు

**కవిగారు**

'అమ్మకృప' (స్వర్ణాలయం) -97 వాసవీ కాలనీ

సికింద్రాబాదు - **500015 (A.P)**

మరియు ప్రముఖ బుక్ స్టాల్స్

పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వ విద్యాలయం ఆర్థిక సహాయంతో ప్రచురితము

# రారాజు - రాజులెక్కడ ?
## గాలిబు

(1 - 52)

గమనిక : బ్లాక్(సంకెల)లలోని కవితలు
కవుల పేర్లు తెలియని వారివి

# ఆత్మాచరణము

నల్గురినీ
నవ్వించుట
నా జీవిత
పరమ ధ్యేయం !

నల్గురికీ
సాయపడుట
నా చేతల
నర్మ భావం !

నల్గురకూ
హృది పంచుట
నా కవితల
నడత విధానం !

నల్గురునూ
ఎదగ చూచుట
నా కన్నుల
ఎద ఆరాటం !

నల్గురికై
కఱిగి పోవుట
నాకు సదా
మహదానందం !

# కృతజ్ఞతలు

48 సంవత్సరాల క్రితమే నన్ను 'కవిగారు' అని పిలిచే వాడూ అది నిజమవ చూచుటకు లేని అపర పోతులూరి, రోటర్ డామస్ నా పెద్ద మేనమామయ్య కీ.శే. దేవులపల్లి వెంకటేశ్వరరావు గారికి,

పీఠిక పరిచయాలు వ్రాసిన ప్రముఖులు

1) శ్రీ పటేలు అనంతయ్య
2) శ్రీ ఏలూరిపాటి అనంతరామయ్య
3) శ్రీ దేవులపల్లి సుదర్శన్ రావు
4) డా. పోతుకూచి సాంబశివరావు
5) శ్రీ కె.వి. రమణ ఐ.ఏ.ఎస్.
6) శ్రీ సుధామ
7) శ్రీ ఓలేటి పార్వతీశం
8) డా.(శ్రీమతి) స్వర్ణలత ఆకునూరు. గార్లకు ,

అన్ని దశలలో పుస్తకం తీర్చి దిద్దడంలో అత్యంత సహకారిగా ఉన్న తనయుడు డా. గౌతం ఆకునూరుకు ,

నన్నెంతో ప్రోత్సహిస్తూ వెన్నుతట్టుతూ, దన్నునిస్తూ తమ అమూల్య అభిప్రాయాలతో తోడ్పడిన పెద్దలు శ్రీ పాణుగుపాటి కృష్ణమూర్తి, పరమ మిత్రులు శ్రీ వడ్డపల్లి సత్యం, గార్లకు

ముచ్చటగా D.T.P. చేసిన సౌ. పద్మకు ( ఉత్తమ్ కంప్యూటర్ సర్వీసస్),

ప్రోసెసింగ్ & ప్రింటింగ్ చేసిన సాయిరత్న ప్రాసెస్ శ్రీ ఎల్లారెడ్డికి

ముద్రణకు పాక్షిక ఆర్థిక సహాయమందించిన పొట్టి శ్రీరాములు విశ్వవిద్యాలయం వారికి

నా హృదయ పూర్వక కృతజ్ఞతాంజలులు.

కవిగారు.

# సౌందర్య సుఖీభవ

'కవిగారి స్వగతాలు' కమనీయముగ వ్రాసి
విశ్వమంతట నిల్చు విలువ చూపించాను
'సందర్భ స్వరములన్' అందమ్ముగా కూర్చి
విశ్వాత్మజ్ఞాని విలువ చాటించాను
'స్వర్ణ గోపాల' అను శతకమునే నుడివి
నూరు విలువల నందు కూరిమిగ చెప్పాను
ఆపై 'ప్రియాంశాలు' అల్లి నే మదిచుట్టు
సంస్కరణ భావాలు జనుల కందించాను
జోహార్లు విజ్ఞతకు జోహార్లు ప్రజ్ఞతకు
జోహార్లు మగువకై జోహార్లు మదిరకై
జోహార్లు ఓ కవీ జోహార్లు తాత్త్వికా
కవిరాజు నీ వయ్యు కలత చెందిన కతన
అపుడు సుందరి నీకు అందకుంటే నేమి
ఇపుడు ఈ 'కవిగారు' ఇటుల రమ్యమ్ముగా
గజలులలో నుండి కమనీయ సుందరిని
సృష్టించి గాలిబా చుక్క ప్రేయసి నీకు
అంతరంగము నుండి అర్పించుతున్నాడు

నీవె నేనన్నంత ఈ గేయములు సుంత

విస్మయము చేసినవి విజ్ఞులెందరినోను

మూలాన్కి దగ్గరగ మమ్మూర్తులా అన్ని

ముచ్చటగ మురిపించి ముదమంద చేసినవి

సంకుచిత భావాలు అంకురించిన మాకు

శ్వాశతపు విలువలన్ సకలబల నేర్పాలి.

నీకీర్తి కౌముదులు నిరంతరాలవై

నింగినేలా రీతి నిక్కముగ నిల్చేను

నీ దివాను సంద్రమును

నే మధించి అనువదించాను

నాకు నచ్చిన నీ అషార్‌ను

నమ్రముగా తెనుగించాను

గైకొనుమయ గాలిబు కవి

ఈమెకు నీవే సుందరుడివి

సుందరితో స్వర్గ లోక

సుఖాల్నికు లభిస్తివి !

# గజలు సుందరి ఆవిర్భావము

ఈ 'గజలు సుందరి' ఆవిర్భావం లోని పురిటి నొప్పులు చాలా అనే చెప్పాలి. లేకపోతే 49సంవత్సరాల క్రితం నాల్గవ తరగతిలో వదిలి పెట్టిన ఉర్దూ మళ్లీ నామది తెరపై మెదలడమూ తెలుగు కవితలను ఉర్దూలోనికి అనువదించే పట్టుచిక్కడం తద్వారా ఉరుదూ అనువాదాల పై కాస్త ఆధికారం ఏర్పడటం అదే ప్రాంతాల్లో గాలిబు దివాను తటస్థించడం అది చదువుతూంటే ఏదో విధమైన తాదాత్మ్యం కలుగటం చదువుతూనే అందులోని మనసుకు నచ్చిన షేర్లు (అషార్) అక్కడికక్కడే అప్పటికప్పుడే అనువదిస్తూ పోవడం అలా 250 షేర్లు (అషార్) వారం రోజుల్లో పూర్తి చేయడం జరిగింది. గాలిబ్ వ్రాసిన ఉరుదూ గజళ్లు 235 అంటారు. ఆందులో ప్రతి దానిలో 5 నుండి 10 చరణాల వరకు ఉండి మొత్తం 1500 చరణాలున్నాయంటారు. అంటే నేనందులో దాదాపు పదిహేడు శాతం వఱకు తెనిగించి నట్లయినది. ఇవన్నీ నాకెంతగానో నచ్చినవీ తెలుగులోనూ సమానభావంతో అనువదించినవీ. మూలంతో సంబంధం గూర్చి ఆలోచించకుండా మెచ్చదగ్గవి. అయితే నాలోని అనువాద భూతం ఆకలి అంతటితో తీరలేదు. 125మంది దాకా ఇతర సనాతన, అధునాతన ఉరుదూ కవుల వైపు మళ్లింది. ఉరుదూకు మెరుగు పెట్టే ప్రయత్నంలో 'ఉరుదూ సియాసత్' డైలీ చదువుతూంటే ఆది, సోమవారాలలో ముంతఖబ్ కలామ్ మరియు యితర గజల్, నజమ్‌లు చూడడం ఆందులోని హృదయానికి హత్తుకుపోయేవీ అనువదించడంతో వీరివీ 550షేర్లు(అషార్) దాకా తెలిగించడం మొత్తం 800 దాకా నా ద్విపదా చౌపదలు సిద్ధించాయి.

ఎవరి పిచ్చి వారికానందం
ఎవరి పిల్ల వారికి అందం
ఈ దిశలో మసిలే వారిని

ఎవరి నెవర మాప గలం!

ఇదీ నా పరిస్థితి. ఈ నా తృష్ణ లోంచి నా ఈ 'గజలు సుందరి' ఆవిర్భవించింది. అయితే దీనికి 'గజలు సుందరి' అని ఉచిత నామకరణం చేసిన పెద్దలు, పూజ్యులు,పాండితీ ప్రకర్షులు శ్రీ దాశరధి రంగాచార్యగారికి ఆజన్మాంతం కృతజ్ఞుణ్ణి. దీనికింతకన్నా మంచి పేరు ఉండదు ఉండబోదు. ఆ మహనీయునికి నామనో జనిత శతకోటి వందనాలు సమర్పించు కొంటున్నాను. ఆయన సాన్నిహిత్యం లభించడం నా పూర్వ జన్మ సుకృతంగా భావిస్తున్నాను.

ఈ పుస్తక ప్రచురణ, ఆవిష్కరణలకు దాదాపు ఏడాది వేచియుండ వలసి వచ్చినది. ఎందుకంటే 27-12-1997 నాడు గాలిబు ద్విశత దినోత్సవం నాడే దీన్ని ఆవిష్కరించాలని తలపెట్టినందువల్ల. ఈ మధ్య సమయమున్నందున వారి ప్రకటన చూపించిన నా తనయుడు చిరంజీవి గౌతం అభీష్టం మేరకు పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారి ఆర్థిక సహాయానికై సమర్పించడం అది లభించడం నాకు వెన్నుతట్టి నట్లైనది. విశ్వవిద్యాలయం వారికి కృతజ్ఞుణ్ణి. ఇంత జరిగాక ఇంకా వెనక్కి చూడకుండా 'బఢ్తే జాయే హమ్ సైలానీ - రుక్నా మౌత్ కి నిషానీ 'అన్నట్లు పదిమంది ప్రాజ్ఞుల అభిప్రాయంలకై దీన్ని చూపడం వారినుండి అమూల్యాభిప్రాయాలు రావడం అన్నీ ఓ కలలా జరిగి పోయాయి. అందరూ ఒకే చోట కూర్చుని అభిప్రాయాలిచ్చారా అన్నంతగా అవుండడం నా తృష్ణ, ఉత్సాహాలకు ఆజ్యం పోసినట్లయింది. గజలు సుందరి మీ చేతుల్లో ఉంది. ' A thing of beauty is a joy for ever". అన్నాడో ఆంగ్ల కవిహృదుడు. సుందరి గాలిబ్‌దే అయినా ప్రపంచ సుందరిగా అందరూ చూచి ఆనందించడం, చదివి ఆహ్లాదించడం సహజమేకదా? ఆవిర్భావంలోనే అనంతంగా ఎదిగిన సుందరి నైతే సృష్టించాను కాని తననో అయ్య చేతిలో పెట్టాలి కదా. దానికి

నాకు తగిన సుందరుడు గాలిబే అనిపించింది. అపుడెలాగు తన మనో సుందరిని పొందక తల్లడిల్లాడా మహానుభావుడు. ఈ సుందరితోనన్నా స్వర్గ సుఖాలందుకోవాలని ఆయనకే ఈ సుందరిని అర్పిస్తున్నాను. ఇతరుల కవితలు వారి కర్పించి (అందులో నేను ఒకనిగా) తిరిగి అందరం కలసి ఇవన్నీ సుందరికి శతాధిక భూషణాలుగా మలిచి మళ్లీ గాలిబుకే అర్పించడం ఒక విశేష ప్రక్రియ. ఇలాగా నా రెండవ కూతురు 'గజలు సుందరి' బాధ్యతా సునాయాసంగా తీర్చుకోవడం నా రెండవ అదృష్టంగా భావిస్తున్నాను. ఒక తండ్రికింతకన్నా ఆనంద ముంటుందా ?

అనువాదం అవధానం
అంత మేటి దైన ఆట
ఒకరి దైన సల్లక్ష్యము
నొరుడిట్టే ఛేదించుట !

పీఠికలో గొప్ప మనో విజ్ఞాని, భూతభవిష్యద్జ్ఞాని శ్రీ పటేలు అనంతయ్యగారన్నట్లు నాలో గాలిబు గుణగణాలన్నీ (జూదం, చౌసర్ తప్ప) కొట్టొచ్చినట్లు కనబడుతూండడం నూరుపాళ్లు నిజం. దానికి నేను గర్విస్తున్నాను. కొన్ని గాలిబు గుణగణములు వివరిస్తున్నాను.

1. ఉరుదూ పారశీలలో నిష్ణాతుడు.
2. క్లిష్ట, అసాధు పదములనుపయోగించి ఇతరులకు భిన్నునిగా ప్రయోగాలు చేయడం.
3. గాలిబు రచనల కర్థంలేదని సమకాలిక కవి ఒకడన్నాడట. దానికి ప్రత్యుత్తరంగా

కోర నేను పొగడ్తలను
కోరను ఏ బహుమతులను
అర్థహీనాలన్నా నా కవితల
అంతగ నేను పట్టించుకోను !

అని త్రిప్పికొట్టాడు – ఇదీ కవి ఆత్మవిశ్వాసంఅంటే !

4. సత్తా వున్న ఇతరుల రచనలనే పొగడేవాడు. కనుక మిగతావారు కినుక వహించే వారు.

5. ఈర్ష్యా బుద్ధులు, సహృదయం లేని వారి అకారణ విమర్శలకు గురైన వాడు. చివరి దశలో కవిసమ్రాట్ అని అందరిచే ఏక కంఠంతో ఆనిపించుకొన్నాడు.

6. గజల్‌కు గొప్పదనం చేకూర్చినవాడు తరువాతి కవులె ందరో ఇతనిననుసరించిరి

7. అసమాన కవితా ప్రతిభా సంపన్నుడు. సహజకవి, శ్రమపడి నేర్వలేదు.

కవిత వెంట పరుగిడ
గాలేదు నేనయి
కవత తానే వలచి
కౌగిట చేరింది ! అన్న ధీమా కలవాడు.

8. వంశాభి జాత్యము, స్వాభిమానం వల్ల అనేక కష్టాలనెదుర్కొన్నా జంకని వ్యక్తిత్వం.

తరతరాల నుండి మేము
స్థిర వృత్తిగ సిపాయిలము
కవితా ప్రవృత్తి తో నాకు
కలుగలేదెట్టి గౌరవము – ఆన్న ధీరోదాత్తుడు.

9. చివరి మొగలు పాదుషా బహద్దురుషాజఫర్‌కు సమకాలీనుడైనా స్వాభిమానంవల్ల కాబోలు ఆయనతో గొప్ప గౌరవము పొందలేదు.

కొసరుగా లభించిన
అసలు సిసలు కాటుకను
వాడిన వారి కృతజ్ఞతే
వరమై నా వెల తీర్చును – అన్నాడే తప్ప ఏమీ
ఆశించలేదు.

10. మహా శృంగార పురుషుడు :
నిగ నిగ లాడే నీకురులు
ఎవని బాహువుల పైన బడు
హాయి నిద్రుడౌ, సూక్ష్మబుద్ధుడౌ
రేయి ఎల్లయూ రేత భద్రుడౌ !
అంటాడు – ఎంతటి శృంగార భావన !

11. పూర్వకవుల అనుకరణము వదిలి క్రొత్తపోకడ ల నవలంబించుట. అన్ని అనుభూతుల వ్యక్తీకరణలో అపూర్వ నూతనత్వ ప్రదర్శన గాలిబు విశిష్టత.

12. విలాసాభిలాషి అయినా విషాదమే దొరికిన వాడు. మరణానంతరం గొప్పకవిగా ప్రసిద్ధి పొందిన వాడు.

13. గాలిబ్ కవితా శైలి ఇతరులెవరికీ నేటికీ వట్టుపడ లేదు. అదీ ఆయన విశిష్టత.

14. అహం గాలిబు ప్రత్యేకత. అన్ని రచనలలో ఇది ఉట్టిపడును.

15. ప్రేమ, సూఫీ తత్వములే ఆధారముగా గల గజలును మార్చి మానవ జీవితమును సమగ్రముగా గజలులో జొప్పించిన ఘనుడు.

భిన్న భిన్న జీవిత దృక్పథములను కవితలలో మలచిన మొదటి కవి గాలిబు – గొప్ప వచన రచయిత గూడా. ఆధునిక ఉర్దూ వచన వాఙ్మయానికి గాలిబు లేఖాపరంపరలె శైలి ఆచార్య పీఠంగా నిలిచింది. ఆయన ఉర్దూ సాహిత్యంలో మహోన్నతుడు.

16. ప్రేమార్ద్ర హృదయుడు – ప్రేయసిని కాస్సేపు ప్రసన్నురాలిగా కాసేపు పరాఙ్ముఖురాలిగా ఊహించి కవితలల్లిన ఘనుడు.

17. ఎంత ప్రతిభావంతుడో అంత దురదృష్టవంతుడు.

18. స్వతంత్ర ప్రవృత్తి కలవాడు. ఇతరులకు విడ్డూర మనిపించినా రూఢిగ్రస్తములైన మార్గాలకు భిన్నంగా

తోచినా తన ఆలోచనలను నిర్భీతగా వెల్లడించే వాడు.

19. చర్విత చర్వణం, ఇతరులు త్రొక్కిన దారినే వెళ్లడం నచ్చని వాడు.
విచిత్ర భావాలు, విచిత్ర అభివ్యక్తీకరణలకు ఆద్యుడు - ప్రత్యేకతా వాది. రచనలలోనూ జీవితంలోనూ అంతే.

20. సనాతన ధర్మ్మలు ఆయనను విమర్శించి గేలిచేసినా ఆయన కవితలను పాఠక సహృదయులు అన్ని లక్షణాలను ఆదరించి ఆనందిస్తున్నారీనాటికి.

21. వింత వింత అనుభూతులు భూమి మీదుండి ఆకాశంలో తేలుతున్నటువంటివి రచనల ద్వారా కలిగించే ఊహాతీత వ్యక్తుడు.

22. వ్యంగ్యం ప్రముఖం గాలిబు కవితలలో.

23. సరిక్రొత్త ఉపమానాలను వాడడంలో దిట్ట.

24. ఇంటిలో కంటే బయటే ఎక్కువగా గౌరవింప బడినవాడు.

25. అతిగా హాస్య ప్రియుడు. బాధాకరమైన పరిస్థితులలో కూడా హాస్యం జొప్పించగల దృఢచిత్తుడు.

26. ప్రేయసి తిరస్కారం, బాధ, ప్రణయం, విరహం, మృత్యువు పై రచనలు ప్రఖ్యాతాలు.

ఇలా వ్రాస్తూబోతే నూటొక్క గుణగణాల ఖని ఐన అందగాడు గాలిబ్.

పైవాటికన్నిటికీ ప్రబల నిదర్శనంగా సంఘటనలున్నా గ్రంథవిస్తరణ భీతిచే వాటిని ఉటంకించడం లేదు. అదే ఒక గ్రంథంగా గాలిబు ఆత్మకథ అన్నంతగా అనేకానేక గుణగణాలున్న మహనీయుడా మహానుభావుడు. ఒకోసారి నాకనిపిస్తుంది ఆ మహానుభావుడే నాలో పరకాయ ప్రవేశం చేసి ఇది వ్రాసుకొన్నాడా అని. ఎందుకంటే నాకు లాగే తనకూ ఓ సుందరి శ్రీమతున్నా ఓ కవిగా జీవితాంతం ఆయన భావాలో ఊహా సుందరి చుట్టూ తిరగడం అవన్నీ ప్రేమ, విరహం, వేదాంతం, మరణాలలో గొప్ప

కావ్యంగా ఆయన దివాను ఉద్భవించేందుకే గాని వేరే యేమికాదని ఎందరో విజ్ఞుల అభిప్రాయం. ఆ సారూప్యత నాలోనూ ఉన్నది. ఇంకో గొప్ప సారూప్యత.

జనావళిలో ఒకనిగా
మనడంలో లేదు మహిత
అందరి కన్నా భిన్నంగా
ఆచరించడం ఘనత     - అన్నది

నా జీవిత లక్ష్యం. అందుకనే విజ్ఞుల కంటపడిన నా రచనలలోని భాషాదోషాలను నేను కావాలని సాహిత్యంలో చేస్తున్న ప్రయోగాలూ, కవియథేచ్ఛా భావాలకు చిహ్నాలని ( దీన్ని కూడా చక్కగా విడమర్చి చెప్పినాడు మహానుభావుడు పటేలు అనంతయ్యగారు) మనవి చేస్తూ

భాషా దోషాలుంటే
మరచి పొండి మిత్రులార
భావ దోషాలేమైనా వుంటే
మాటాడండి సుజనులార ! అని

తెలుపుకుంటున్నాను. భావ విశదీకరణకు సౌందర్యారాధనకు భాష, వ్యాకరణం, పదాలు అవరోధం కారాదని నా అభిమతం. దీన్ని విజ్ఞులు శ్రీ వోలేటి పార్వతీశం గారు కూడా వెల్లడించారు.

శ్రీ పటేలు అనంతయ్యగారి పీఠిక నాకిచ్చిన ఉత్సాహం, ప్రోత్సాహం గజలు సుందరిని సర్వాంగ సుందరంగా తీర్చి దిద్దడానికి ఎంతగానో ఉపకరించింది. స్వయంగా గాలిబు ఇతర ఉర్దూ కవుల నెంతో దక్షతతో అనువదించిన విజ్ఞుడాయన. ఆయనకు ఈ విధంగా నేను ఋణ పడినానా అనిపిస్తున్నది. దీనికి పీఠిక వ్రాయడానికి ఈయనే కడు సమర్థుడని తోచింది. ఆయన పీఠిక వ్రాయడం నా అదృష్టమనిపించింది.

సాహితీ చైతన్య సాహితీ భీష్మ డా. పోతుకూచి సాంబశివరావుగారు నాకు పరమపిత. (God Father) ఆయన

వ్రాసిన పరిచయం 'అందాల రాశి గజలు సుందరి' నాకు సత్యంగా సుందరమైన శివాశీస్సు.

సరస్వతీపుత్రులు శ్రీ ఏలూరిపాటి అనంత రామయ్యగారి పరిచయం 'పరదా వీడిన గజలు సుందరి' పుస్తకాన్నాసాంతం ఏక విగిని చదివి ఆనందించి ఒసంగిన పండిత ఆశీరమృతం.

'మూలాన్ని మురిపించే అనువాదం' నా అన్నయ్య (మేనమామ) శ్రీ దేవులపల్లి సుదర్శన్ రావు గారి నుండి నాకు గొప్ప ఖితాబు.

పరిపాలనా దక్షుడు కూడా పాండితీ ప్రకర్షడ వొచ్చునుటకు దృష్టాంతము శ్రీ కె.వి.రమణాచార్యగారు(IAS). ఆయన 'మైత్రీ వచనాలు' సాహితీ జగత్తులో నాకు సీనియర్‌గా, తెలుగు, ఉర్దూలలో, సమాన గరిమగల భాషాప్రియుని, సహృదయుని, మహా వచనాలు.

శ్రీ ఓలేటి పార్వతీశంగారు, శ్రీ సుధామ గార్లిద్దరూ బృహదాకాశ దివ్య వాణి అన్నంతగా తమ పరిచయాలు 'ఇదంతా ఆమె ధ్యాసే', 'అను(భూతి) వాద భావన' ల ద్వారా అన్నను వెన్ను తట్టి దన్ను నిచ్చిన అవ్యాజ ప్రేమ మూర్తులు, భరత-లక్ష్మణ సమానులు.

ఇక చివరదైనా చిన్నయేం మాత్రం కాని శ్రీమతి డా. ఆకునూరు స్వర్ణలత పరిచయం 'భావోద్వేగ సౌందర్య తరంగాలు' సరస్వతీ సదృశ నుండి అమందానంద అనురాగాలు. ఘన పూర్వీకుడు గాలిబ్‌కు అందని నా ఆనందాలుగా భావిస్తున్నాను నా ఈ తపోయజ్ఞ ఫలాలను సమంగా పంచుతున్నాను.

పై వారందరికీ ప్రత్యేక కృతజ్ఞతలు.

ఈ సందర్భంగా ఇతఃపూర్వగాలిబు అనువాదకులను తలుచు కోవడం నా కర్తవ్యంగా భావిస్తున్నాను. కీ.శే. దాశరధి గాలిబ్ గీతాలు సుప్రసిద్ధాలు. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అన్న ఈ నేల గర్వించే ఘన కవి, మహానుభావుడు కీ.శే.

గాలిబ్ గీతాలు సుప్రసిద్ధాలు. 'నా తెలంగాణ కోటి రతనాల వీణ' అన్న ఈ నేల గర్వించే ఘన కవి, మహానుభావుడు కీ.శే. దాశరధిగారు. ఆయునకు నా భక్తి పూర్వక నమోవాకములు.

శ్రీపటేలు అనంతయ్యగారు అత్యంత రమణీయంగా గాలిబు మఱియు ఇతర ఉరుదూ కవులను అనువదించిన కవీశ్వరులు. వారికి నా కృతజ్ఞతా వందనములు.

డా. వల్లపురెడ్డి బుచ్చారెడ్డి గారి గాలిబు అనువాదం చూసే అదృష్టం నాకు కలగకున్నా ఆయున కవితలు అద్భుతాలని నేను విన్న సత్యం. వారికి నా అభినందనలు.

ఇంకా ఎవరన్నా వ్రాసి వుంటే ప్రక్రియలో నా పూర్వీకు లందరికీ పేరపేర వందనాలర్పిస్తున్నాను.

అందరూ ఉరుదూ భాషా సౌందర్యానికి, గాలిబు భావ గాంభీర్యానికి సమ్మోహితులై చేసినవారే-ఇంక మున్ముందెందరు చేయునున్నారో? ఎవరెరుంగుదురు. రామాయణం వ్రాసిన వాల్మీకి మహానుభావుడు. ఆయునవే స్ఫూర్తిగా కొని నేటికీ రామాయణాలు వస్తూనే వున్నాయి. యుగాంతం వఱకు వ్రాయు బడుతూనే ఉంటాయి. అది వాటి మహనీయుత.

గాలిబు దివాను కాక ఈ ప్రక్రియలో నాకు సహకరించనవి ఫుట్ పాత్ పైకొన్న చిట్టి కవితాసంకలనాలు, ఉర్దూ సియాసత్ డేలీలు మాత్రమే. వాటికి, వారికి కృతజ్ఞతలు. గాలిబ్‌తో సహా 125మంది కవులకూ నా అభివాదములు. దీనివల్ల వారి ఉత్కృష్ట రచనా గరిమ, ఉన్నత భావాలతో ఆంధ్రులకానందం కలగించాలని చేసిన ప్రయుత్నమే ఇది.

సహృదయు పాఠక లోకం నా ఈ ప్రయుత్నాన్ని ఆదరిస్తే నాజన్మధన్యమైనందుకు కృతజ్ఞుణ్ణై వుంటానని తెలుపుకుంటూ

కవిగారు.

# పీఠిక

మిత్రులు శ్రీ గోపాల కషన్ రావు 'కవిగారి' తో నాకు ఈ మధ్యే పరిచయం. వారి కవితలు కూడా ఈ మధ్యే చూచాను.

తాము అనువదించిన ఉర్దూ గజల్లకు పీఠిక వ్రాయమని కోరారు. కాదు అభిప్రాయము వ్రాస్తానని చెప్పాను. ఐనా వారిది పీఠికగా వేసుకుంటే నాకు అభ్యంతరం లేదు.

వారి అనువాదాలు ముఖ్యంగా గాలిబు గజల్ల నుండే కాక ప్రక్కనెందరో గొప్ప ఉర్దూ కవులున్నారు, మిర్ తఖీమీర్, వలీ ముహమ్మద్ వలీ, ఫైజ్, ఇక్బాల్, పిరాఖ్, మోమిన్, హస్రత్, దర్ద్, బహద్దుర్‌షా జఫర్, అనీస్, అమ్జద్, జౌఖ్, జుర్రత మొదలగు వారే కాక ఇతర ఉర్దూ కవులు నూట పాతిక మందివి గజల్ నజం, రుబాయీలతో కూడి యున్నవి కూడాను తనవి కాక.

గజల్ ఉర్దూ సాహిత్యంలో ఒక విశిష్టమైన ప్రక్రియ - పాఠకులను, శ్రోతలను మోహముగ్ధుల చేసే గుణం ఈ ప్రక్రియలోని ప్రత్యేకత. ప్రణయాంశం ప్రధానమైన గజల్ క్లుప్తతకు గుప్తతకు సినలైన ప్రతీక. ఇది 'ధ్వనికి గని' అన్నాడో గొప్పకవి. ఇది 'రసోత్తకూజితం' అన్నాడు మరో మహాకవి. అందుకే కదా 'గజల్' అంటె రసిక లోకం చెవులు కోసుకుంటుంది. సామాన్యులు సైతం 'గజల్ సునేంగే' అంటారు.

ఇంతగా ఆకట్టుకోగల ఈ కవితా ప్రక్రియను యితర భాషల్లోకి అనువదించుటకు ఉత్సాహ పడటం సమర్థులైన ఉభయ భాషా ప్రవీణులైన (ఉర్దూ–తెలుగు) పండిత కవులకు సహజమే!

ఏ భాషయందైనా కవిత్వంలో అగ్రస్థానం వహించేది బాధా గర్భితమైన ప్రస్తావనే. దర్ద్(బాధ)ను వ్యక్తం చేయడానికి అసలు సిసలైన భాష 'ఉర్దూ'. గజల్ మూల స్వరూపం గాని ప్రశంసనీయ పాత్ర గాని ప్రణయావస్థలో అనుభవాతిగా

అనుభవించేది బాధే – గాలిబ్ కవితలు సమస్తం యీ సామగ్రితో నిండి యున్న కారణంగా ఆయన గజల్ – సమ్రాట్, బహుశః అన్నికాలాలకు, ఐతే ఆయన 'తరె' బయాన్' వివరణ శైలితో కవిసమ్రాట్ కావడంలో ఆశ్చర్యమేమీ లేదు.

గాలిబు కవితలు (గజళ్లు) అర్థం కావాలంటే మొదలు గాలిబును అర్థం చేసుకో గలగాలి. ఇతర ఉర్దూ కవుల వలె గాక గాలిబ్ జీవిత ధ్యేయం, జీవితం పట్ల దృక్పథం, ఆలోచనా సరళి, సుగుణాలు, మానసిక స్థితి ప్రత్యేకం – ముక్కుకు సూటిగా నడిచే మనిషి, నిజాయితీకి నిలబడేవ్యక్తి, స్నేహానికి ప్రాణమొడ్డే సాహసి, మధుపిపాసి, చౌసర్ జూద వ్యసనకారి, ప్రశంసనీయమైన అతని బలహీనత స్త్రీ సౌందర్యారాధన. గాలిబ్ తన వ్యసనాలను, లోపాలను ఎప్పుడూ కప్పిపుచ్చలేదు. సర్వ స్వతంత్రుడుగా వ్యవహరించే వాడు.

'కవిగారి' తో నాకున్న కొద్ది పరిచయంలో వారి కవితలలో గోచరించే మూర్తిమత్వంతో చాలా వరకు వారి యందు గాలిబ్ గుణాలు, దృక్పథాలు కొట్వొచ్చినట్లు కన్పడతాయి – త్రాగుడు, జూదం మినహాయించి. కాబట్టి వారి అనువాదాలు గాలిబ్ ఆలోచనా ధోరణికి అతి దగ్గరగా ఉండడం విశేషం – అందుకే కాబోలు అనువాదానికి గాలిబ్ గజళ్లు ఎన్నుకున్నారు సాహసంగా – అందుకు అభినందనీయులు.

గజలు అనువాదాల కాద్యులయినవారు కీ.శే. దాశరథి, డా. వల్లపురెడ్డి బుచ్చారెడ్డి, భవదీయుడు మొదలగువారు ఉర్దూ గజళ్ల 'బహర్' కాక తెలుగు ఉపజాతుల ఛందస్సు నాధారంగా అనువాదాలు వ్రాశారు. కాని కవిగారు ఏ ఛందస్సు పాటించలేదు. సర్వ స్వతంత్రంగా తనకు నచ్చిన లయలో భావ ప్రాధాన్యతా స్ఫృతితో అనువాదాలు ఒక తరహా వచన కవిత్వంలో వ్రాశారు.

అక్కడక్కడ వ్యావహారిక భాషా పదాలు వాడారు. అవి పొసగలేదంటే మనతో ఏకీభవించరు. మార్పుట కొప్పుకోరు. అదివారి సాహసం, స్వతంత్రం, నిఖచ్చి వైఖరి – ఒక కవి కుండ వలసిన యధేచ్ఛ.

అనువాదం కవిత్వం వ్రాయుట ప్రయాసతో కూడినపని. కవిగారు అవలీలగా వ్రాసి పడేశారు. సునాయాసంగా మాతృకలోని భావం సంపూర్ణంగా తోడి యిటు గుమ్మరించారు. ఉదాహరణకు చదవండి.

మూలం :

నాజుకి ఉస్కే లబ్‌కి క్యాకహెనా
పంఖ్డీ ఏక్ గులాబ్ కీ సి హై

అనువాదం :

'ఏమి కోమల మామె పెదవులు
పోలెనవి చూడు గులాబి రేకులు'

మూలం :

చల్తాహు థోడి దూర్ హర్ఏక్ తేజ్‌రౌకె సాధ్
పహచాన్తా నహీహు అభీ రహ గుజర్‌కుమై

అనువాదం :

ప్రతి పరుగిడు పాంథునితో
పరుగు తీస్తి కొంతసేపు
ఇంకయునూ తెలియు లేదు
ఎవరన్నది మార్గదర్శి !

సూటిగా సరళంగా దిగిన ఈ అనువాదాలు, అనువాదాలు కాక అసలు సిసలైన మూలంలా ధ్వనిస్తున్నవి. 'తేజ్ రౌకె సాధ్' అనే పదానికి అర్థం వేగంగా నడిచే (ప్రవహించే) సాగే అని. దాన్ని రమ్యంగా 'పరుగిడు' అని వాడడం యింపుగా వుంది. రెండవ

చరణంలో మార్గదర్శిని 'గుర్తించలేదు' అనాలి 'తెలియులేదు' అనే పర్యాయ పదంతో తెనుగు సహజత్వం ప్రదర్శించారు. అలాగే 'కొంతదూరం' అని రావలసిన మాటకు 'కొంతసేపు' అనే వాడుకతో భావం దెబ్బతినకుండా ప్రవాహాన్ని వేగంగా నడిపించడం విశేషం – కొంత సేపు పరుగిడడం కొంత దూరం అధిగమించి నట్లేకదా! తాము స్వంతం 'కవిగారు' తేజ్‌రో కవితా పాంథులే (పరుగిడువారే)!

వీరి అనువాదంలో ఒక ప్రత్యేకత వుంది. ఇది 'మక్కీకి మక్కి' అనువాదం కాదు. మీదు మిక్కిలి అక్కడక్కడ స్వేచ్ఛానువాదాలు చేశారు. భావం ప్రభావ పూరితంగా వ్యక్తం చేయుడానికి వీలుగా తమవైన కొన్ని శబ్దాలు అధికంగా చేర్చుట మరో ప్రత్యేకత. ఉదాహరణకు ఈ క్రింది అనువాదం చూడండి.

నా ప్రేయుసి వచ్చు వార్త
నమ్మికగా నాకు తెలిసె
ఇంటిలో నేడో చాపయు
కంటనే పడదాయె!

'ఖబర్ గరంహై' అనే మాటలో భావ గర్భితంగా వున్న సూచన తప్పకుండా ప్రేయుసి వస్తుందనే మాట నొక్కి చెప్పడానికి 'నమ్మిక'గా అనడం విశేషం.

మన 'కవిగారు' ఔత్సాహిక అనువాదకులు. మూలంలోని కవితా భావం పాఠకునికి అందునో లేదోనను ఆందోళనతో అక్కడక్కడ అధిక వివరణలు కూర్చడం ఆక్షేపించ నవసరం లేదు. అనివార్యాలు కాకపోయినా అవి ప్రయోజనాత్మకాలు, ప్రయోగాలు, ప్రశంసా పాత్రాలు.

'జబ్ కె తుఝు బిన్ కోయీ నహి మౌజూద్
ఫిర్ ఎ హంగామాయె ఖుదా క్యాహై'

ఈ కప్లెట్ అనువాదం 'నీవు తప్పయితరు లెవ్వరూ లేనప్పుడు (ఉనికి యేలేనప్పుడు) దేవుని గురించి ఈ హడావుడి, గందరగోళం యేమిటి ?' అని వుండాలి.

ఈ మూలంలో గర్భితమైన భావాన్ని కవిగారీ విధంగా విడమర్చి చెప్పారు.

నీవే అల్లా నీవే ఈశ్వర్ ఈసా నీవె కదా
ముస్లిం హిందూ ఈసాయీలు భాయి భాయి కదా
వీరి మధ్య ఎందుకీ మత కలహాలో ఖుదా
వీరందరికి ఐక్యత నీవైనా నేర్పరాదా ?

నిజానికి పై మూలానికిది అనువాదంగా తోచదు.

నీవు ఒక్కడివే అయినప్పుడు ఈ 'హంగామా' యెందుకు అనటానికి హంగామాపై హంగామా చేసేసి గాలిబ్ ఉద్దేశ్యాన్ని నినదించి ఘోషించారు. అందరి ఖుదా 'ఒకే ఒక్కడని', ఎంతైనా అభినందనీయం.

ప్రేయసి సంయోగం కోసం వేచియుండుట గాలిబ్ తట్టుకోలేడు. వేచి యుంటే ఫలితం ఉంటుందని యే మాత్రం నమ్మకం లేదు. ఆ ఎదురుతెన్నుల కంటె మృత్యువే మేలని భావిస్తాడు. కాని పైకి ఆ మాట అనడు ఎంతవేచినా సంయోగ భాగ్యముండదనే తెలుసతనికి, ఖచ్చితంగా – అతడొక భగ్నప్రేమికుడు, విధివంచితుడు, ఆవేదనా భరితుడు – అందుకే అంటాడు

'ఏహ్ నథీ హమారి ఖిస్మత్ కె విసాలె యార్ హోతా
అగర్ ఔర్ జీతె రహతే యహి ఇంతెజార్ హోతా'

అనువాద కవిగారంటున్నారు

'ప్రేయసిని పొందు భాగ్యము
పొసగ దాయె యే మాత్రము

ఎంతకాలమిక బ్రతికిన
ఎదురు చూపె గతిమాత్రము !'

ఇది అనువాదం కాక పిసలైన మూలంలా వియోగపూరిత ఆవేదన ఘోషిస్తున్నది- అందుకే గాలిబ్ వలె మన కవిగారు బాధాగ్రస్తులు కాలేదు కదా అనేంత అనుమానం కలిగించడం యీ గజల్ లోని విశేషం - ఒక అనువాదానికి యింత కంటె ఉదాత్తత అబ్బే భాగ్యముంటుందా ఓహ్ !

గుండెను కుదిపే గజలు కవిత్వం వ్రాసిన 18వ శతాబ్దపు ఉర్దూ కవులలో పేరెన్నిక గన్న వాడు 'మీర్ తఖీ మీర్'. మీర్ మీరే (మేటియే) అందుకు సందేహం లేదు. ప్రణయంలో పడి తనగతి ఎంతగా క్షీణించి పోయిందో తానే వాపోతూ అంటాడు.

ఎహ్ జర్ద్ జర్ద్ చహ్రా యెహ్ లాగ్రీ బదన్ హై
క్యా యిష్క్ మే హువా హై ఐ మీర్ తేరహాల్'.

అనువాదం :

వెలవెల బోయిన నీమోము
అలాగ చిక్కిన నీ తనువు
ప్రణయ మెంత కుంగదీసె
కాంచినావా ? కవీ ఓ మీర్ ?

'జర్ద్ జర్ద్ చహ్రా ' అంటె పచ్చగాపలికిన వుుఖవుని. అనువాదంలో 'వెల వెల బోవటం' అన్న తెలుగు జాతీయంతో మూలంలోని భావానికి ప్రాణం పోయుటం శ్లాఘనీయం. తక్కిన భావం సరళ సుందరం, సర్వవందితం.

దేశ స్వతంత్ర సంగ్రామ సందర్భంలో కవి బిస్మిల్ ఆంగ్లేయులను సవాల్ చేసిన తీరులో నిగూఢమైన అపురూపత్యాగ నిరతి అనన్య సాహసోపేత భావం అన్ని భాషల్లోకి అనువాదం

కాదగిన గజల్ ,

సర్ ఫరోషికీ తమన్నా......

దేఖ్నాహైజోర్ కిత్నా.......

ఈ ద్విపంక్తిలోని అర్థం నేడు మేము తలను వెలకమ్ము కునే కోరిక కలిగి యున్నాము–చూడవలసిందల్లా – హంతకుని బాహుబలం. ఈ భావాన్ని కవిగారు రమ్యంగా మలచి మరింత భావగాంభీర్యం కూర్చారు. చూడండి :

అమర వీరత హృదయు మందున
అమరి పోరుకు సిద్ధ పడినాం
శత్రు సేనల కండ బలమది
చూడ వలెనది ఎంత యన్నది !

తలనమ్ముకునే కోరిక కలుగటం, అమరత్వం పొందుటకేనని తెర తొలగించి చెప్పటం, హంతకుడు మరెవ్వరో కాదు శత్రువేనని సూటిగా వాక్రుచ్చడం బాగున్నది. బంగారుకు మెరుగు పెటిరనట్లు. ఈ అనువాదంలోని మరో విశేషం, ఇవి పాడుకొనుటకు వీలుగా వుండటం.

జ్ఞాన పీఠ పురస్కారం పొందిన కవి ఫిరాఖ్ ఉర్దూ కవిత్వంలోని ప్రక్రియలన్నీ చేపట్టి సాధించి సెభాష్ అనిపించుకున్నాడు. అతని రుబాయిలు సైతం అత్యంత ఆదరణీయాలయ్యాయి. మాతృ దేశాభిమానంలో గుండె గుమ్మరించిన ఫిరోఖ్ రుబాయికి అర్థం :

నీమెత్తని ఒడిలో నిద్ర బుచ్చినావు
నిశ్శబ్దపు పిలుపుతో నిద్ర లేపినావు
నీ సేవలో తరించ నిమ్మో జన్మభూమి
నీ మట్టితో కదా మమ్ము మలచినావు !

అనువాద విషయంలో చెప్ప వలసిన మాట మరొకటుంది. సమాంతర శబ్దాలు, జాతీయాలు, నుడికారాలు యిత్యాదివి ఒక బాష నుండి మరో భాషలోకి పరివర్తనం చెందేటప్పుడు ఒక క్రొత్త రూపం దాల్చటం వింతేమి కాదు. వాటిని యదాతథంగా అనువదించటానికి పూనుకుంటే భాషా సౌందర్యమే కాక భావ సౌందర్యం కూడా చెడిపోయి మూలం దారితప్పే ప్రమాద ముంది. అనువాదం పాఠకుని అవగాహనకు దోహదం చేయాలి.

పఠిత సంస్కారాన్ని బట్టి గజల్‌లో అనేక అర్ధాలు స్ఫురింప వచ్చు. వీటన్నిటిని అనువాదంలోకి దిగుమతి చేయడం అశేష ప్రజ్ఞా ధురీణులకే సాధ్యం. ఆమాట కొస్తే అనువాదాని కన్నా మూల రచనే సులభం – కవితాను వాదం మరీ కష్టసాధ్యం.

కవిగారి అనువాదాలలో మూలంలోని సోయగాలు, సొగసులు, క్లుప్తత గుప్తత సాధ్యమైనంత వరకు గాడి తప్పకుండ నడవడము, భావం ఎక్కడా వికటించ కుండా పొందు పరచడం శ్లాఘనీయం.

తెలుగు పాఠకులకు 'కవిగారు' ఉర్దూ కవితా మృష్టాన్నమందించుటకు చేసిన ప్రయత్నము శతధా అభినంద నీయం.

19–5–97

16 –2–741/45సి పటేలు అనంతయ్య

ఆంధ్రా బ్యాంక్ కాలనీ

మలక్ పేట, హైద్రాబాద్ – 36

# అందాల రాశి - గజలు సుందరి

కవిగారు గజలు సుందరి గ్రంథం రూపొందించారు. గాలిబ్ కవి ఒక్కరే గాక యింకా వంద పాతిక మంది ఉర్దూకవుల కవితలు( తనూ కాక) ఇందులో తెలుగు అనువాదాల ద్వారా పొందుపరిచారు.

ఉర్దూ సాంప్రదాయిక కవితా రీతుల్లో భౌతిక సౌందర్యం, విరహ వేదనా మాధుర్యం అనిర్వచనీయమై కవితా భావాలలో తొంగి చూస్తాయి. తరుణీ సౌందర్య ఆరాధన, వారి మానసిక ప్రవృత్తి - అన్ని రకాల భాషల కవితా రీతుల్లో ప్రతిబింబిస్తున్నా ఉర్దూ భాషా సౌందర్యంలో తరుణీమణి అందాలు యింకా శోభ చేకూర్చు తుంటాయి. వారి రచనా రీతిలో విశిష్ట వైచిత్రి కనిపిస్తుంది.

గాలిబ్ ప్రముఖ కవి. ఆయన స్త్రీ ఆరాధన ఆదర్శం - కాని విరహ వేదనలో నిరాశావాదం తొణికిస లాడుతుంది. వేదనా భరితంగా కవిత సాగుతుంది. నిజమైన ప్రేమలో విరహ వేదన అంతర్గత విద్యుత్తు. దానిని హృదయాంతరాళంలో అనుభూతి పొందిన వాడు గాలిబ్.

అలాగే ఇతర ఉర్దూ కవులు గూడా - అనువాదాలు కవిగారు భావస్ఫోరకంగా, అర్థవంతంగా, రమణీయంగా, ఔచిత్యపరంగా రూపొందించారు.

గాలిబ్‌ను ఇదివరలో దాశరథి తెనిగించారు. ఇంకా సినారె వంటి కవులు గజళ్లు రాసి గాలిబ్‌ను తలపించారు. గజలు తెలుగులో అన్ని లక్షణాలతో ఆవిర్భవించినా ఉర్దూ గజళ్ల సౌందర్యం ఎంత వరకు పుణికి పుచుకున్నాయి అన్నది విమర్శకుల సందేహం. కానీ ఉత్తమ కవిత అన్ని భాషల్లోకి రావాలి.

ఆ విధంగా కవిగారి అనువాద కృషి చాలా ప్రశంసనీయం.

కళాప్రపూర్ణ
డా.పోతుకూచి సాంబశివరావు.

1-3-18/ఎ, కవాడిగూడ
కల్పనా థియేటరువద్ద
సికింద్రాబాద్ - 80 ఫోన్ : 7533177.

# పరదా తొలగిన ఉరుదూ సుందరి

భద్రాచలం దగ్గర ఉన్న పర్ణశాల చూడటానికి వెళ్లినపుడు ప్రక్కనున్న సీతమ్మ వారు చీరలు ఆరవేసుకొన్నపుడు ఏర్పడిన చారలు ఇప్పటికీ ఉన్న ప్రదేశానికి తీసుకువెడతారు. అక్కడికి వెడుతుంటే మిరప తోటలలో నుంచి వెళ్లవలిసి వస్తుంది.. ఆ మిరప తోటలు ఇరవై సంవత్సరాల క్రితం చూస్తే అవి బుజాల దాకా పెరిగి ఉన్నాయి. బాగా మిరప పంట పండే ప్రాంతంలో మోకాలు కంటే కొంచెం ఎత్తు మిరప తోటలనే చూచిన నేను ఈ తోటంతా ఇంతెత్తులో చూసి విస్తు పోయాను. కారణమేమిటని ఆలోచిస్తే ఈ ప్రాంతంలో సృష్ట్యాది నుంచి ఏవో చెట్లో మొక్కలో మొలుస్తుండడం మళ్లీ అక్కడే వ్రాలి ఆ సారమంతా ఆ భూమికే తిరిగి అర్పిస్తూ ఉండటము– ఇలా సారం నుంచి సారాన్ని ఉత్పత్తి చేసి దానిని మళ్లీ ఆ భూసారం లోనే కలిపి ఆ భూమిని మరీ సారవంతం చేస్తుండడం తప్ప ఆ సారంనుంచి వచ్చిన పంటను ఎక్కడికో పంపి దీనిని నిస్సారం చేసే పద్ధతి లేక పోవడమేననిపించింది.

ఇదం ప్రథమతయా ఈ అహల్య లాంటి ప్రదేశాన్ని హల్యను చేసే సరికి నేలబారు మొక్కలు నింగినంటేవయి కుంచెడు పుట్టెడుగా పండించేవయాయని తోచింది.

ఏనాటినుంచో ఒకరంగంలో ఏదో పనిచేస్తూ ఆరంగంలో ఏదో ఉత్పత్తి చేయవలసిన వాళ్లు ఏమి చేయ కుండానో చేసిన దంత సారవంతం కాకుండానో చేసే వాళ్లుగా మిగిలిపోతే హఠాత్తుగా ఒక్కసారి స్ఫుత్నిక్కుల్లాగా రోదసీలోకి దూసుకుపోవడం అన్ని రంగాల్లో కనిపిస్తుంది. అక్కడ అలా జరగడానికి ఇదే కీలకం.

సాహిత్య రంగమూ ఇంతే. శివ భారతం, శివ తాండవం ఇలా దూసుకు పోయిన స్ఫుత్నిక్కులే – వారంతటి వారు వీరని చెప్పటం నా అభిప్రాయం కాదు. యెవరంతటి వారు వారు. ఎవరెంతటి వారో ఎవరూ ఎప్పుడూ సరిగా అంచనా వేయలేరు. అంచనాలెప్పుడూ దేశకాల పాత్రలను బట్టి గురికి బెత్తెడెండగా ఉంటాయే కాని సత్యాన్ని చెప్ప గలవి కావు. ఆంధ్ర దేశంలో 16వ శతాబ్ది ఉత్తరార్ధంలో ఉన్న పింగళి సూరన్న ఎన్నో గ్రంథాలు వ్రాస్తే మూడు రకాల మూడు గ్రంథాలు మిగిలాయి. వాటిలో రాఘవ పాండవీయం ఆయన ఉన్న రోజుల్లో గొప్పదని అందరూ మెచ్చుకొన్నారు. కళాపూర్ణోదయం కృత్రిమ రత్నము గానే

ఈసడించారు. ఆది ఇంచు మించు లుప్త ప్రాయమయి పోయిన దశలో ప్రపంచం 20వ శతాబ్దంలో చూస్తే ఇంత గొప్ప గ్రంధం లేదని అసలు ఈ వాఙ్మయంలోనే లేదనీ అందరూ ఆశ్చర్యపోతున్నారు. కనుక సాహిత్యం విషయంలో ఎవరి అంచనాలూ నిర్దుష్టాలు కావు, శాశ్వతాలూ కావు.

కవిగారు ఇంజనీరుగా పేరుకెక్కిన వారు. రిటైరు కాబోయేముందు కవిత్వ రచనకు పూనుకొని అవిరామంగా, అవిఛ్ఛిన్నంగా కవిత్వ మైరేయాన్ని శ్వేత పత్ర చషకంలో పోసి అందరినీ మైమరపింప చేస్తున్నారు.

వారు ఉరుదూ, హిందీ, ఇంగ్లీషు తెలుగు కవిత్వం అందచందాలకు పరవశించివారు. పరదా వెనకనున్న ఉరుదూ కవితా సుందరి ఘోషా తొలగించి కేవలం ఘోషా కలవాటు పడిన వారికి ఆనందం కలిగించాలని ఈ 'గజలుసందరి' ని మన ముందు నిలిపిన ఉదారులు.

ఇందులో గాలిబు గజళ్ల మాత్రమే కాక నూటపాతిక మంది మధుర కవుల కవితలు కూడా ఉన్నాయి. ఇవి అన్నీ అనువాదాలంటే నమ్మటం కష్టంగానూ, కవిగారి సొంత సృష్టులంటే సత్యోక్తిగానూ ఉన్నాయి. కవిగారి స్వంత సృష్టులూ ఉన్నాయి.

ఇందులో కొన్నింటికి ప్రసిద్ధుల అనువాదాలుండ వచ్చుగాక, ముఖ్యంగా గాలిబు మహాకవి దాశరధి అనువాదాలు ప్రచారంలోకి వచ్చాయి కూడా . మళ్లీ ఇదెందుకు? ఈ ప్రశ్న తెలిసిన వారెవరూ వేయరు ? వాల్మీకీ రామాయణం కాక సంస్కృతంలోనే ఎంతమంది ఎన్ని రూపాలలో వ్రాయలేదు? ఎన్ని భాషలలోనికి ఎన్నిరూపాలలో ఆది నిరంతరం అనువాదం కావడంలేదు ?

ఎవరి అనుభూతి వారిది. ఎవరి హక్కు వారిది.

కవిగారి ఈ కవితలు నాకు ఆనందం కలిగించాయి. అరమరికలు లేని మనస్సుతో చదివిన వారెవరికైనా ఆనందం కల్గిస్తాయి.

ఏలూరి పాటి అనంతరామయ్య.

శ్రీసాయి అపార్ట్‌మెంట్స్
సైదాబాదు కాలనీ
హైద్రాబాదు.

# మూలాన్ని మురిపించే అనువాదం !

అనువాదం అన్నా అనువాదకుడన్నా సాధారణంగా చిన్నచూపు చూడడం అలవాటు మన సాహితీవేత్తలకు.

రామాయణ, మహాభారత, భాగవతాది పురాణేతి హాసాలన్నీ తెలుగు వారికి అనువాదాలుగా లభించినవే.

అనువాదం ఒక విశిష్టమైన కళ.

అనువదించాల్సిన మూలం ఉన్న భాష లోనూ, అనువదించాల్సిన భాషలోనూ అనువాదకునికి సమాన పాండిత్యం ప్రధానావసరం కాగా మూలంలోని భావాల్ని పూర్తిగా ఆకళించుకొని సందర్భానుసారం భావాభివ్యక్తీకరణ శబ్దార్థాలకు విఘాతం కలగకుండా చెప్పగలగాలి.

సంస్కృత భాగవత ఆంధ్రీకరణలో కొన్ని ఘట్టాల్లో పోతనగారి పోకడ మూలాన్ని మించి పోయిందని ఒప్పుకోటానికి ఎవ్వరూ వెను దీయరు. 'గజలు సుందరి' పేర 'కవిగారు' (అకునూరు గోపాలకిషన్) కొన్ని ఉర్దూ కవితల అనువదించి గాలిబ్, తనూ కాక, నూట పాతిక ఉరుదూ కవులను తెలుగు వారికి పరిచయం చేయబూనటం ముదావహం. అయితే ఇందులో నాకాశ్చర్యం కల్గిస్తున్న విషయమొకటున్నది.

కవి నా మేనల్లుడు కాబట్టి ప్రాథమిక విద్యాస్థాయి నుండి ఇంజనీరింగ్ పట్టభద్రుడయే వరకు అతని విద్యాభ్యాస క్రమము, ప్రగతి, ఇత్యాది వివరాలతో పూర్తి పరిచయమున్న వాణ్ణి.

ఉర్దూ మాధ్యమంతో కేవలం నాల్గవ తరగతి వరకు మాత్రమే విద్యనభ్యసించాడు. అటు తరువాత ఉర్దూ భాషతో నిత్య సంబంధం దాదాపు తెగి పోయిందనే చెప్పాలి.

మప్పై ఆరు సంవత్సరాల ఉద్యోగ జీవితం ఉర్దూ భాషతో అవసరంలేకుండానే గడిచింది.

గృహస్థ జీవితం యావత్తూ ఉర్దూ వాసన ఎరుగని పదహారణాల ఆంధ్రవాతావరణంలో సాగింది.

కొందరు సాహిత్యం పట్ల అత్యంత అభిమానంతో తమ ఉద్యోగ ధర్మాలను కొంత నిర్లక్ష్యం చేసి భాషాభివృద్ధికీ, సాహిత్యాసక్తికీ కృషి చేసిన వాళ్లని నే నెఱుంగుదును. చిరంజీవ గోపాలకిన్ తన ఉద్యోగ ధర్మాన్ని నిర్వర్తించిన అంకిత భావం అనన్య సామాన్యం.

పదవీ విరమణ కాలానికి సుమారు ఎనిమిది నెలలు ముందు మాత్రమే సాహితీ క్షేత్రంలో అడుగిడినాడు.

అలాంటి సాహితీ శిశువు ఆంధ్ర, ఆంగ్ల, ఉర్దూ భాషల్లో చక్కని రచనలు చేస్తూ, ఒక భాషనుండి మరోభాషకి ములాన్ని మురిపించే స్థాయిలో అనువాదాలు అందించ గలుగు తున్నందుకు ఎంతో సంతోషించడమే కాదు, ఒక విధంగా గర్విస్తున్నాను కూడా !

ఉర్దూ మూలంతో పరిచయంలేని పాఠకులు వీనిని తెలుగు రచనల లాగానే చదివి ఆనందించవచ్చు. ఉభయభాషలతో చక్కని పరిచయము గలవారు నా సంతోష, గర్వ కారణాలు సహేతుకమేనని, బంధు పక్షపాతంతో కూడుకున్న అనుభూతులు కావని అంగీకరిస్తారని నా నమ్మకం !

భగవంతుడీ కవికుమారునికి ఆయురారోగ్య, కీర్తి, ఐశ్వర్యాదులు ప్రసాదించాలని మనసారా కోరు కుంటూ

మేడే 1997
విశ్వమాతా సదన్
శ్రీ నగర్ కాలనీ (ఉత్తర)
వడ్డేపల్లి – హన్మకొండ

దేవులపల్లి సుదర్శన్

# మైత్రీ వచనాలు

కీ.శే. దేవేరా గారిచే సుమారు ఐదు దశాబ్దాల క్రితమే 'కవిగారి' గా పిలిపించుకొని కవిగా రూపొందిన కవిగారు శ్రీ ఆకునూరు గోపాలకిషన్ రావు గారు. ప్రముఖ విద్యుదింజనీరుగా పదవీ విరమణ చేసిన 20 నెలల్లో 22 సంకలనాలను వ్రాసి పది నెలల్లో నాల్గు సంకలనాలను ప్రచురించి ఐదవ సంకలనానికి ముహూర్తం సంకల్పించడమెంతో ముదావహం.

'కవిగారి స్వగతాలు' తర్వాత 'కవిగారి సందర్భ స్వరాలను', 'కవిగారి స్వర్ణ గోపాల శతకము', కవిగారి ప్రియాంశాలను' వెలువరించిన తరువాత ఉర్దూ భాషా యోషా ప్రియుడై నందువలన గాలిబ్ మీర్ తఖీ మీర్, అమ్జద్ హుస్సేన్ అమ్జద్ హైద్రాబాదీ, రఘుపతి సహాయ్ ఫిరాఖ్ గోరఖ్‌పూరీ, మోమిన్ ఖాన్ మోమిన్, ఫైజ్ అహమ్మద్ ఫైజ్, అక్బర్ అలహాబాదీ, వలి మహమ్మద్ వలీ, రయీసుద్దీన్ రయీస్, అమీర్ ఖుస్రో, మహమ్మద్ ఖులీ ఖుతుబ్ షా మున్నగు హేమాహేమీ ఉర్దూ కవివరుల మొత్తం నూట పాతిక మంది సనాతన, అభ్యుదయ కవివరుల కమనీయ కవితాలహరిలో పరవశుడై జోల పాడుతున్నట్లు, జ్వాల రేపుతున్నట్లు, జాలి గొల్పుతున్నట్లు, ఉండే చరణాలను ఎన్నుకొని పదం, భావం, అనుభూతిని ముప్పేటలా కలగలిపి స్వేచ్ఛానువాదం చేస్తూ గుండెతో పలికించే 'గజలు సుందరి' ని సృష్టించారు కవిగారు. గజలంటే అనేకార్థాలున్నా శృంగార పరంగానే చెప్పుకొంటూంటాం. అయితే కవిగారి ఈ 'గజలు సుందరి' కి తాత్త్విక స్పర్శ, ప్రగతి శీలము, మానవీయ దృక్పథం అలంకార ప్రాయాలు. గతి నియతులకు అతీతంగా చెప్పదలుచుకొన్న విషయాన్ని నాలుగు చిన్న చిన్న పాదాల్లో ఇమిడించి, వచన కవిత్వంలో, మినీ కవితా ప్రయోగం సాధించే ప్రయోజనాన్ని చౌపదుల ద్విపదల రూపంలో 'గజలు సుందరి' సాక్షాత్కరిస్తున్నది.

పాట స్వభావంలో నుండి గజలు పుడితే, పద్య స్వభావంలో నుండి రుబాయి పుట్టింది. గజళ్లనూ, రుబాయీలనూ తెలుగు రంగప్రవేశం చేయించింది మహనీయుడు దాశరథి. గాలిబ్ గీతాలు, సినారె 'మౌనరణం' కవిగారికి ఆదర్శమూ, స్ఫూర్తినూ. గాలిబు ద్విశత జయంతి సందర్భంగా గాలిబువీ, ఇతర ప్రసిద్ధ ఉర్దూ కవుల కవితల్లోంచి తాను నచ్చినవీ, మెచ్చినవీ అయిన కొన్ని ఏర్చి, కూర్చి పేర్చిన సంపుటియే ఈ 'గజలు సుందరి'. మచ్చుకు ఈ సుందరి సౌందర్య విశేషాలు కొన్నింటిని చూద్దాం!

'రెండు హృదులు జతైతే మూడోది పుట్టుకొచ్చు........
..................................................
..................................................
తీగలు రెండు కలువగనే 'జీవకాంతి' ఉద్భవించు'

పై చరణాల్లో ఉర్దూ రుబాయి రచనలో యావద్భారత కీర్తి నార్జించిన అమ్జద్ హైదరాబాదీ రుబాయికి తెలుగు సేత చేస్తూ విద్యునింజనీరుగా తన లక్షణాన్ని తెలపక తెలిపారు.

మరణమే లేకుంటే
బ్రదుకుట కేదాకర్షణ ?'

'బాధల తరంగాలు
పాఠశాల లాంటివి
ప్రతి తెప్పా అందులోన
గురువు చెంప దెబ్బ !'

గాలిబ్ గీతాల్లోని జీవిత సత్యాల్ని అనల్పార్థం వచ్చే రీతిలో చిన్నచిన్న మాటల్లో పొందు పరిచారు కవిగారు. మరోచోట :

గుండెలో నున్న
ర క్తపు చుక్కలన్ని
కంటి నుండి గులాబులై
కారి పోయెను వాగులై !

రక్తపు చుక్కలు..... గులాబులై... కంటి నుండి కారిపోయెను వాగులై....... కన్నీళ్లన్న పదం వాడబడలేదు. గుండె మండితేనో, ద్రవిస్తేనో కన్నీళ్లొస్తాయి. ప్రతి వాడికీ అనుభవైక వేద్యమే ! చేప్పే రీతిలో వైవిధ్యం.

'అగ్గి పుల్ల అతి చిన్నదిలా కనబడ్డా
ఒక్కసారి గీకితే భగ్గుమని చూపించు'.

అగ్గిపుల్ల నెవ్వడూ పట్టించుకోడు. గీకిన అగ్గిపుల్లను చూస్తే మాత్రం ఎక్కడ ఏమంటుకుంటుందో... ఏది భగ్గుమంటుందో నన్న భయం - ఆందోళన !! అగ్గిపుల్ల లాంటి జీవితాలెన్నో ప్రపంచంలో !

షౌకతలీఖాన్ రచించిన గీతాన్ననువదిస్తూ -

'ఇంతకు ముందెవరన్నా చస్తే ఏడ్చేవారము
ఇప్పుడెవడైనా బాగా బ్రదికితే ఏడుస్తున్నాము'

కాదనలేము ! అవుననడానికి కాదనిపించే నగ్న సత్యం. నిత్యమూ సమాజం స్థితిగతులు తెలిసిన వాడెవడికైనా గుండెను కదిలించే చరణాలివి.

డిసెంబర్ 31 నాటి రాత్రి ఆంగ్ల సంవత్సరాదిని ఆహ్వానిస్తూ విందులూ, వినోదాల్లో పాల్గొనడం నాగరిక లోకానికి పరిపాటే. అయితే జగత్ మోహన్ లాల్ రావణ్ రుబాయిల్ని తెల్గులోనికి తర్జుమా చేస్తూ

'సంవత్సరాది నేడండి. తిక్కగా త్రాగండి
చషకమెలా చాలుతుందీ సుదినం నాడు
ఆకసాన్ని తిరగేసి ఒలుకు దాక నింపండి
......................................'

మూడవ చరణంలో వర్ణించే ఆకాశాన్నే తిరగేయమన్నాడు కవిగారు. ఉర్దూ కవిగారు చెప్పింది అర్ధంకాని వారికీ, మధుపాన ప్రియులకూ కవిగారు చేసిన తర్జుమా ప్రియాతి ప్రియం.

వేరొక చోట –

'నీటి చుక్క ముత్యమవగానే
చిప్ప విడిచి పోవాలే
కాయలు తము పండగనే
శాఖ వీడి పోవాలే
సంపూర్ణత ఎంత శాపం ?

అన్నారు కవిగారు. ఈ చరణాన్ని విశదీకరించడమో వ్యాఖ్యానించడమో చేస్తే – నాలాంటి వాడికి దుస్సాహసమే అవుతుంది.

భట్టి గారి కవితననువదిస్తూ :

'బాధల కన్నీరు తుడువ
రుధిర హృదయ మున్నది
రమ్యంగా ఓదార్చగ రంగుల
ఉదయాస్తమయాలున్నవి !

అని బాధితులకో ఓదార్పు నేర్పుగా అందించారు.

ఇలా వ్రాస్తూ పోతే - ఎన్నో చరణాలు మననం చేసుకోవాలని పించేవి మురిపించేవి ఎన్నో ! ఎన్నెన్నో !! తాను గజళ్లను రుబాయీలను వ్రాశానని కాక గాలిబునూ తననూ కాక వంద పాతిక మంది ఉర్దూ, ఫారసీ కవుల్లో గాలిబ్ స్థానం గాలిబ్‌దే నన్నట్లుగానూ, గాలిబ్ తో పాటు జోడించి గౌరవించుకున్న ట్లుగానూ వారి కవితల్లో తాను నచ్చిన, ముషాయిరాల్లో 'వహ్వా' యని పించే ప్రజలు మెచ్చిన ఒళ్లు జలదరింప చేసే ఉర్దూ గజళ్లను, రుబాయీలను ఎన్నుకొని, స్వతంత్రంగా, సుందరంగా అనువదించి తెలుగు రంగ ప్రవేశం చేయించి, సహృదయ సాహితీ జనావళికి ఆమోద యోగ్యంగా, కన్నుల పండుగగా కవిగారు 'గజలు సుందరి' ని సృష్టించి, వీక్షించడానికి, సమీక్షించడానికి - రసజ్ఞుల హృదయం రసాలంలా మలచుకోవడానికి అవకాశం కల్పించారని విశ్వసిస్తూ -

కవిగారి ప్రయత్నం సాహితీ మూర్తులు, సాహితీ పరులు హర్షిస్తారని ఆశిస్తూ -

ఈ నా 'మైత్రీ వచనాలు' మైత్రీ బంధ సూచకాలే కాని, యోగ్యతాభావ సేచకాలేమాత్రం కావని సహృదయ పఠిత్రులోకానికి సవినయంగా మనవి చేస్తూ -

ఆసాంతం 'గజలు సుందరి' సౌందర్య విశేషాల్ని తిలకించ గోరుతూ

సెలవు
మీ
రమణ
(కె.వి.రమణ IAS)

హైద్రాబాదు
అక్టోబర్ 10, 1997

# భావోద్వేగ సౌందర్య తరంగాలు

సాహిత్యము జీవన ప్రతిబింబము. దేశకాల పరిస్థితులను, పరిపాలనను బట్టి ప్రజల జీవన విధానము మారును. సాహిత్యము వారి అవసరములను తీర్చుటకు, సరైన సందేశములను అందించుటకు పనికి వచ్చును. మంచి సాహిత్యము ఎల్లప్పుడు జీవితములోని ఉన్నత తత్త్వములను, ఉదార నీతులను బలపఱచును.

ఏ భాషలో సాహిత్యాన్ని పరికించినా, మనకు దాదాపు అందరి కవుల లక్ష్యము ఒకటిగానే కనబడుతున్నది.

ముఖ్యంగా మన తెలుగు భాష తరువాత మధురమైన భాష 'ఉర్దూ' అని నా అభిప్రాయం. నేను 'ఉర్దూ' లో పండితురాలను కాను. ఈ భాషతో పరిచయమున్నదాన్ని. ఇదంటే నాకు అమితమైన ఆరాధన. అందుకే ఈ భాష లోని పద్య సాహిత్యాన్ని శ్రద్ధగా వినటం, అర్థం చేసుకోవడం నా తీరిక సమయాల్లో చేస్తుంటాను.

'గజల్' అనునది పారసీక పదము. ఈ పదమునకు 'స్త్రీలతో సంభాషించుట' అని అర్థము. గజలు కేవలం ప్రేమ, శృంగారాల వర్ణనకే పరిమితము కాలేదు. తరువాతి కాలంలో దేశభక్తి, నీతి, రాజనీతిలాంటి అనుదిన సామాజిక అవసరాలెన్నోచోటు చేసుకున్నవి. అన్ని విషయములు సరళముగా, సరసముగా మధుర భావనలు, అంతరంగిక ప్రతీకలు, పదగుంభనలతో నిండి ఉంటాయి. గజల్ లోని భావములో అంత రంగ ప్రతీకలు

గుల్ – గులాబీ పుష్పము
బుల్బుల్ – కోకిల
చమన్ – ఉద్యానవనము
కఫన్ – శవవస్త్రము

గజలులో మొదటి చరణమును మత్లా (ఉదయించుచోటు)

అందురు. చివరి చరణమును 'మఖ్తా' అందురు. ఇందులో కవి తన పేరును నిక్షిప్త పరచడాన్ని 'తఖల్లుస్' అందురు. ఖాఫియా రదీఫ్ అంత్యప్రాసలనందురు.

ఉర్దూ భాషలోని సాహిత్య సముద్రమును మథించినంతగా మానవ జీవిత అనుభవాల అగాధ రహస్యములను వెలికి తీసి చక్కని శైలిలో పాఠకులకు అందించిన వాడు 'మిర్జా గాలిబు'. గాలిబు గజళ్లు లోక ప్రసిద్ధములు. అంతటి మహాకవి గజళ్లను తెలుగులోనికి అనువదించారు కవిగారు. ఇది సామాన్యమైన పని కాదు. ఒక యజ్ఞము, తపస్సు చేసినంత శ్రమతో కూడు కొన్నది. కవిగారు అనువాదములలో దిట్ట అని పాఠకులకు తెలుసు. అందుకనే అలవోకగా అనువదించారు.

'గజల్ సుందరి' అను తన ఈ కావ్యములో కేవలము గాలిబు గజళ్లే కాక యితర నూట పాతిక సనాతన, అధునాతన కవుల గజళ్లు, రుబాయీలను వీరు అనువదించారు. ఆయునకు గాలిబ్ పైనున్న గౌరవమును గాలిబ్‌కు నంబరివ్వకుండా ఉండడంలోనే తెలుస్తున్నది. ఇక తనను కూడా చివరి వానిగా పెట్టుకొని ఉరుదూ అనువాదాలు చేసి చేసి తనకు కల్గిన అలాంటి అనుభూతుల్నీ అందులో కవిత్వీకరించారు. మచ్చుకు రెండు భావాలు :

1. నమాజా ముస్లింకెంతో
నాణ్యమైన నీమము
ఆన్నినుదురు భూమాతకు
అవుతాడు పవిత్రుడు !

2. అనుభవాలు కోకొల్లలు
అఘోరిస్తున్నానే తప్ప
కవిగా నేనేదో గొప్పగ
కవిత్వీకరిస్తున్నాని చెప్ప !

కవిగారి అనువాదాలు నాలాంటి సామాన్యులకు కూడా అర్థమయ్యేలా సరళంగా, సరసంగా, సున్నితంగా, భావ పరంపరా పరిమళాలు వెజల్లేవిగా వుండటం విశేషం.

అనువాదం ఒక కళ, నైపుణ్యం. నిరంతర కృషి, రెండు భాషలలో సమాన నైపుణ్యం కలిగి వుంటేనే ఈ కార్యానికి పూనుకోవటానికి సాహసించే ప్రక్రియ. ఈ సాహసాన్ని చిన్నపిల్లలు బంతి ఆట ఆడినట్లు అవలీలగా కవిగారు ఉర్దూలోంచి గజల్లను, రుబాయీలను తెలుగు లోనికి అనువదించారు. 'గజల్ సుందరి' చదువుతున్నప్పుడు ప్రతి చౌపద, ద్విపద ఒక ఆణి ముత్యమనిపించింది. అందులో కొన్ని ముత్యములు మచ్చుకు :

బాధల తరంగాలు
పాఠశాల లాంటివి
ప్రతి తెప్పా అందులోన
గురువు చెంపదెబ్బ !

వృత్తి రీత్యా ఉపాధ్యాయినిని కాబట్టి కవిగారి ఈ కవిత 'వాహ్వా' అనేలా వుందని చెప్పక తప్పదు.

తప్పు చేయువాణ్ణి దండించు నటుల
తప్పు చేయనపుడు మెప్పులీయరేల ?

ఇది అక్షరలక్షలు చేస్తుంది. అందరినీ ఆలోచింప చేస్తుంది.

రెప్పకాలంలో రాలేదు స్వరాజ్యం
కాళ్లెన్నో ఐనాయి ముళ్ళ మయం
మహనీయుల నెందరినో
మనం దానికై కోల్పోయాం !

చదివిన వారిని దేశభక్తితో పులకింప చేసే కవిత ఇది :

తుఫానేమి చేస్తుంది
దృఢ నిశ్చయ శీలుల్ని
నిండు గుండె ఆతిథ్యం
అడ్డ లేదు పేదరికం!

చదువరులను కార్యోన్ముఖులను చేసే చౌపద.

కఠిన ప్రేమ మార్గాల్లో
కదలాడా లింక నీవు
పూల దార్ల వీధుల్లో
పోతున్నదిపుడు నీవు!

ఆలోచనలో ముంచెత్తే జీవిత సత్యం.

పిచ్చుకా కూలిన గూటిని
రెచ్చి మరీ కడుతూ పో
పిడుగదే విసుక్కుని
పడడం మానును పో!

ఇది అనువదించిన తీరు శ్లాఘనీయం. ప్రతి ఒకరికి కార్యదీక్షను ప్రబోధించే కవిత.

ఉర్దూ సాహిత్యము యింత రమ్యంగా ఉంటుందని తెలుపడానికి కవిగారు వాటిననువదించి మన ముందుంచారా అనేంత చక్కగా తెనుగించారు. వీటిని సాహిత్య సభల్లో, కవి సమ్మేళనాలలో పాడి ముషాయిరాలలో వినిపించే 'వాహ్వా' నాదాలు వినవచ్చు.

కవిగారి ధర్మపత్నిగా ఈ కావ్యము లోక ప్రసిద్ధము కావాలని కోరుతున్నాను. ఉర్దూ తెలుగు తెలిసిన వారిని ఉగ్రూతలూగించిన ఈ అనువాదకావ్యము, రసరమ్యమై పండిత పామర జన రంజకమై, సాహితీ రంగంలో తనదంటూ ఒక ప్రత్యేక స్థానాన్ని సంతరించుకున్న కవిగారికి కీర్తి కిరీటాలనందిస్తుందని చెప్పటానికి సాహసిస్తున్నాను. నాకు ఉర్దూ

భాషలో ప్రావీణ్యం లేకున్ననూ ఈ పరిచయ వాక్యాలు వ్రాయుటకు ప్రోత్సహించి, అవకాశమిచ్చినందుకు కవిగారికి నా ధన్యవాదములు.

ఈ కావ్యం చదివిన పిదప నాకు తెలియ కుండానే ఆయన కవితా వైదుష్యంలో కూడా అర్ధాంగినా అన్నట్లు నేను ఒక వచ్చిరాని షేర్ చెప్పి ముగిస్తున్నాను.

వక్త్ హై ఆప్ ఖలమ్ జబ్‌సే షాయరాన అందాజ్‌మే
ఫూల్ బహారోంకే బర్సేహై హమారే దిలోమే !

చదువరులపై కవిగారి గజల్ల ప్రభావానికి దొక మచ్చుతునక మాత్రమే !

'గజలు సుందరి' లో ప్రతి ఒక్కరి జీవితంలో కలిగే అసాధారణ అనుభవాలు ప్రేమ, శృంగారం, భక్తి, ప్రార్థన, రక్తి, ముక్తి, వేదాంతం లాంటి ఎన్నో భావోద్వేగాల్ని పాఠకుల హృదయాల్ని స్పృశించి తమ అనుభవాలేనా అనిపించి తాదాత్మ్యంతో ఆనందింపచేసేవిగా మలిచిన ఈ ద్విపదా చౌపదలు తరతరాల వారికి నిత్యనూతనంగా వెలుగునే చూపుతాయని నా ప్రగాఢ విశ్వాసం.

డా. స్వర్ణలత ఆకునూరు

అమ్మకృప ( స్వర్ణాలయం )
97వాసవీ కాలనీ
సికింద్రాబాదు – 15
8 –11–1997.

# అను( భూతి )వాద భావన

పచ్చగడ్డి తిన్న ఆవు ఇచ్చే పాలు పచ్చగా వుండవు.

ఆరగించేదానికీ, అభివ్యక్తం చేసే దానికీ అంతరం వుంటుంది.

ఎంత తిన్నాం అన్నది కాక – ఎంత జీర్ణించుకున్నాం, ఎంత శక్తిమంతులమై సంచరిస్తున్నాం అన్నది ముఖ్యమైనట్లుగానే –

అందుకున్నదానికన్నా, అందించే దానిమీదే దృష్టి.

సౌందర్యం వుంటుంది. కానీ దాని అసలు సౌందర్యం అనేది మన అనుభవంలోనూ, అనుభూతి లోనూ అందుతుంది మనకు.

'తాను మునిగింది గంగ. తాను మెచ్చింది రంభ' అన్న సామెత విన్నదేకదా!

'అందనిది ఎంత అందమయిన దయినా మనకేం ఉపయోగం!' అనుకునే వారు కొందరుంటే–

అందనిదే అయినా – దూరం నుంచే చూసి ఆనందించే వారు కొందరుంటారు.

సాహిత్యం విషయమూ అంతే.

ముఖ్యంగా అనువాద సాహిత్యం సంగతి.

ఒక భాష లోని సొగసు, జిగి బిగి, తళుకు బెళుకు, గాఢత, సాంద్రత, తత్త్వమూ పూర్తిగా ఆ భాషకే సొంతం.

అవి వేరే భాషలోకి రావా అంటే వస్తాయి. కానీ యథాతథంగా రావు. తేడా పాడాలతో వస్తాయి. అనువాదకుడు ప్రతిభామతి అయితే అసలు ఎలావున్నా, అనువాదం ఆకర్షణీయ మౌతుంది.

అసలు అనువాద రచన ప్రయోజనం ఏమిటి ?

అనువాదకుడు – ఉభయభాషాజ్ఞాని, సరసుడు, సహృదయుడు అయినప్పుడు ఒక భాషా సాహిత్యంలో తనను అలరించిన,

ఆకర్షించిన, తనహృదయాన్నీ బుద్ధినీ కూడా రంజింప చేసిన రచనను తనకు నచ్చిన మరో భాషలోకి (మరీ ప్రత్యేకించి సహజంగా తన మాతృభాష లోకి) అనువదించడానకి సంసిద్ధుడవుతాడు.
అనువాదకుడు ఏ భాషలోంచి రచనను అనువాదం చేస్తున్నాడో ఆ మూల భాష రాని పాఠకులు, ఏ భాషలోకి అనువాదం చేసాడో ఆ భాషా పాఠకులు చదివి ఆనందించడమే ప్రధానంగా అనువాద రచన ప్రయోజనం.
ఉర్దూ బాగా వచ్చిన పాఠకుడు ఉర్దూ గజల్స్ రుబాయీలూ నేరుగా చదువుకుని ఆనందించగలడు
ఉర్దూ రాని తెలుగు పాఠకుడు ఉర్దూ గజల్స్ రుబాయిల సౌందర్యాన్ని, రచనా విశాషాలను, ఆ కవితా మాధుర్యాన్ని అందుకోవాలి అంటే అనువాదమే శరణ్యం.
కవిగారి 'గజలుసుందరి' తెలుగు పాఠకుల కోసం దిగివచ్చిన సుందరి. ఆ'హసీనా' హొసాలను ఆయున అక్షరాల్లో గుమ్మరిస్తున్నారు. గాలిబ్ వంటి సుప్రసిద్ధ కవి ఉర్దూ కవితా సౌందర్యాన్ని మాత్రమే కాదు, సూటపాతిక ఇతర ఉర్దూ కవుల రచనా సౌందర్యాన్ని కవిగారు తెలుగులో తేటతెల్లం చేసేందుకు సంకల్పించి చేసిన కృషి ఇది.కాక కొన్ని తన భావాలు వెల్లడించారు.
ఉర్దూ మూలాన్ని, తెలుగు అనువాదాన్ని పక్కపక్కన పెట్టుకుని తులనాత్మక అధ్యయనం చేసే పండితులకోసం, ఉర్దూకవితలోని ఛందస్సులు, గణమాత్ర పరిగణనలు అనువాదంలో, తెలుగులో ఏ తూగులో, ఏ లయల్లో వచ్చాయి అని విశ్లేషణ చేసే విమర్శకుల కోసం కవిగారు ఈ అనువాదం చేయులేదు.
కవితలో సౌందర్యం కోసం, అచ్చమైన అనుభూతి కోసం అర్రులు చాచే సహృదయు సామాన్య పాఠకుల కోసం ఆయున ఈ అనువాదానికి

పూనుకుని నిర్వర్తించారు.

ఉర్దూనుండి ఇది యథాతథంగా ముక్కికి ముక్కగా చేసిన అనువాదం కాదనీ, తాము నాల్గవ తరగతిలో వదిలి పెట్టిన ఉర్దూను - గజల్స్ గొప్పదనానికి మురిసి, తుప్పుపట్టిన మెదడులోని ఆ భాషా కోశాన్ని దులిపి, ఆకళింపు చేసుకుని, చదువుతున్న క్షణంలోనే అనువాద భావం మెదలి, అక్షరబద్ధం చేస్తూ ఈ రచనలు సాగించాననీ కవిగారే స్వయంగా చెప్పుకున్నారు.

అందువల్ల తెలుగులోకి వచ్చిన కవిగార 'గజలుసుందరి' సౌందర్యం బురఖా లోనే వుండి పోలేదన్న మాట వాస్తవమే కానీ, కొన్ని తావుల్లో పరదాల మాటునుంచి మెరిపిస్తూ, మురిపిస్తూ కనబడే మాట మాత్రం నిజం. అయితే ఈమె స్వేచ్ఛ, సరళత, సూటిదనం ఈ నవ్యకాలానికి తగిన నాగరిక సౌందర్యంతో భాసిస్తున్నాయి.

అసలే పరదాలలో
ఆపై మరో పరదా
చూపుకసలు అందవు
అందకుండ ఉండవు
ఏమి ఈ ఊగిసలాట
ఇదేమి మన సయ్యాట

అని ఆవేదన కలగకుండా కవిగారు, శతాధిక ఉర్దూకవుల భావ శబలతను అనుభూతిరమ్యంగా, స్వచ్ఛందంగా, రసప్రవచనంగా అందించారు.

ప్రణయం, ప్రళయం, వలపు, వగపు, శృంగారం, సింగారం, తరుణ రక్తి, ముక్తి వంటి భావాలన్నీ లలితంగా రంగరించి పోశారు. అనువాదం నడకలో ప్రాసలూ యతులూ అంటూ లేకపోయినా, వచన కవిత్వపు నడకలో సైతం ఒక అంతర్లయ స్ఫురించగల సమతూకపు పదాలను ఎంచుకొన్నట్లైతే మరింతగా భాసించేది.

ఏమయినా ముందే చెప్పినట్లు -

అనువాదం అంటే ఆరగించినదాన్ని ఆరగించి నట్లుగా ఆర బోయడం కాదు.

కావలసింది 'కక్కు' కాదు. ఒక 'కిక్కు'.

పచ్చగడ్డినే తిన్నా, ఆవు-పరమ రమణీయంగా స్వాదువయిన క్షీరాన్ని ఎలా అందిస్తుందో -

ప్రతిభామతి అయిన అనువాదకవి మూలాన్ని మూలమట్టంగా ఆకళింపు చేసుకుని, ఆ మౌలికతను జీర్ణం చేసుకుని, సారవంతంగా అక్షరాల్లో అనూదితమౌతాడు. రసక్షీరాలను పాఠకులకు అందిస్తాడు. కవిగారు ఆ పనే చేశారు. పాదుగు పాదుపుకున్న మేర పితికినన్ని పాలు. ఇక్కడ 'పచ్చగడ్డి' అంటే గోవు దృష్టిలో జ్ఞానస్వరూపమయిన పరబ్రహ్మాత్మకమైన అన్నమే తప్ప లౌకికమైన పచ్చగడ్డి కాదని గ్రహించడం మరీ ముఖ్యం. ఎందుకంటే 'మూలం' అనేదానికి వున్న విలువ, గొప్పతనం సవ్యంగా సంభావించడం ప్రథమ కర్తవ్యం.

అన్ని అందాల కన్న
ఆత్మానందం మిన్న
నశ్వరాలందాలన్నీ
శ్వరము లేని దాత్మేనన్న !

అని విశ్వసించిన కవిగారు ఈ 'గజలుసుందరి' లో అనువాద సౌందర్యానికి మించి, అనుభూతి ఆత్మకు ప్రాముఖ్యమివ్వడం ప్రశంసనీయం. కవిగారి ఈ అనువాద మానస సరోవరంలోనికి పాఠక 'హంస' లకు సుస్వాగతం.

సుధామ
(ఆకాశవాణి)

13 -10-97.

# ఇదంతా ఆమె ధ్యాసే

సూర్యోదయం ఎప్పుడు కావాలో ప్రకృతి నిర్దేశిస్తున్నది. చంద్రోదయం ఎప్పుడు కావాలో ప్రకృతి నిర్దేశిస్తున్నది. అలానే వసంతం ఎప్పుడు రావాలో శిశిరం ఎప్పుడు కావాలో ప్రకృతి నిర్దేశిస్తున్నది. మనిషికున్న అదృష్టమేమంటే, ఇటువంటి నిర్దేశాలు, నిర్ణయాలు, నిరంకుశత్వాలు, అతని విషయంలో లేవు. ఎప్పుడు ఏ పువ్వును చూసి స్పందిస్తాడో, ఎప్పుడు ఏ కుసుమ పేశలమైన భావాన్ని చదవి ఎందుకు చలించిపోతాడో, ఎవ్వరూ నిర్ణయించి ఏభావాన్ని ఆస్వాదించి ఎందుకు పరవశించి పోతాడో నిర్వచించటం అసాధ్యం. ఆ స్పందన అనిర్వచనీయం.

ఈ స్వేచ్ఛ వల్లనే భావుకుడైన మనిషి, ఒక్కొక్క సందర్భంలో అనుకోకుండా కలిగిన అనుభూతికి, కరిగి కవిగా మారుతున్నాడు. సరిగ్గా అలాగే కవిగారై పోయిన ఒక భావకుడి భావహర్మ్యం ఈ 'గజల్ సుందరి'. ఇంతకు మునుపు ఆవిష్కరించిన కావ్యాలతో, ఆంధ్రదేశంలో 'కవి' గా స్థిరపడిన శ్రీ ఆకునూరు గోపాల కిషన్ రావు, ఇప్పుడు ఈ కావ్యంతో సుప్రశిద్ధులౌతున్నారు.

సౌందర్యాన్ని ఆరాధించడానికి భాష ప్రతిబంధకం కాదు, కారాదు అన్న మాటలకు అక్షర సంకేతం కవిగారు.

పరభాషా(వ) సుందరిని చూసి పరవశించిన కవిగారు, ఆమెకు తెలుగు తనాన్ని కలిగించే ఆలంకారాలు తొడిగారు. తెలుగు మాటల వస్త్రాలను అలంకరించారు. పరగేయు ప్రవేశం చేసి, రసరమ్యంగా తీర్చి మనముందు ఆవిష్కరించారు.

'నైరాశ్యం ఎంతగాను
నరకంలా తోస్తున్నది
ప్రేయసి తీపి జ్ఞాపకాలను
వేగంగా మరిపిస్తున్నది'.

మనిషికి ఎంత మాత్రం కూడదనుకునే నైరాశ్యం, మనిషికి ఎంత ఆవశ్యకమో ఒక కొత్త కోణం నుండి మనకు ప్రదర్శించారు.

'చిరకాలం జీవించే
సుర మిత్రుల కన్నా
పది మందికి పనికి వచ్చు
మన నరులే మిన్న'

మనుషులందే మాధవుణ్ణి వెదకి పట్టుకోమన్న ఆర్యుల భావానికి ఇదొక క్రొత్త ప్రతిబింబం.

'మిత్రుడొకడు పొరపాటున
ఆమె అందమును వర్ణించెను
నాటి నుండి నాకాతడు
శత్రువు తానై కనిపించెను'

తెలియని అర్థాలను తెలియచెప్పే వాళ్ళను గౌరవిస్తాం. తెలియని అందాలను చూపెట్టే వాళ్ళను అభినందిస్తాం. చెలి అందాన్ని చూపిన మిత్రుణ్ణి నిందించబూనటం ఒక వినూత్న భావ ప్రదర్శన. మరొక వినూత్న భావ ప్రదర్శనను చిత్తగించండి.

పుష్ప గీతిని కాను
తంత్రి మూర్ఛన కాను
ఓటమి నుద్భవించిన
ఓ గుండె చప్పుడును

'ఓటమిలో నుంచి పుట్టిన గుండె చప్పుడును' అనడంతో, ఒక జీవిత నేపధ్యాన్నంతా మనముందు ఆవిష్కరించిన అనుభూతి కలుగుతోంది. ఇటువంటి ప్రయోగాలు భావ మథనం లోంచి పుడతాయి. కవిగారి కవన నైపుణ్యానికి చిరునామాలై నిలుస్తాయి.

'గుండె పగిలెను కనుక
కొంత కలిగెను కినుక

కాని జీవిత మెల్ల
కలిగింది నిమ్మళము'

'బాధే సౌఖ్యమనే భావనరానీవోయ్' అన్న వేద వాక్యంలాంటి మాటకు ఇది సరిక్రొత్త రూపసమర్పణం. గుండె పగిలే మాటల్లోంచి, పరవశించే అర్థాలను ప్రకటించడం కవిగారి సమర్థతకు నిలువెత్తు దర్పణం.

'ప్రేమలో పడిన వారికి
లేదు చావు బతుకుల్లో తేడా
ఎవరికై పడిచస్తారో
వారి కోఅకె బ్రదుకుతారు'

రెండు గీతల్ని కలిపి అందాన్ని ప్రతిష్ఠించ గలిగిన 'బాపు' కి
రెండు మాటల్ని కలిపి అర్థాన్ని ప్రతిష్ఠించ గలిగిన 'ఆత్రేయ' కి
వారసత్వపుచ్ఛాయల్ని ప్రతిష్ఠించారు కవిగారు పై పంక్తుల్లో

భావ కవుల వారసత్వం, కవిగారి 'గజల్ సుందరి' భామసౌందర్యంలో వసంతమై ప్రవహించింది. కవిగారి కవన పటిమకు అది గీటు రాయై నిలుస్తుంది. గజల్ సుందరి ధ్యాసలో కవిగారికి ఈ ప్రశంసలు.

వోలేటి పార్వతీశం.

దూరదర్శన్
హైద్రాబాదు.
25-11-97.

# కవి సమ్రాట్

# మిర్జా అసదుల్లాఖాన్ గాలిబ్

(1797 - 1869)

# కవి రారాజు – గాలిబు
## తాత్వికుడు – వేదాంతి

సులభ సాధ్యము కాదు
చూడ ఏ పని కూడ
మానవత్వమె లేదు
మనిషి యందున చూడ ! 1

నీ తాత్విక చింతన
నీ సాహితీ కల్పన
నీకు నీవే సాటి యున
గాలిబా యేదేమైన
మధుపాయివి కాకుంటే
మహర్షివే నీవని
మహిని పొగడ్తలు
వచ్చెడివి మరీని ! 2

జీవనార్తులు దీర్చ
మరణము ప్రఖ్యాతి
తెల్లవారెడు దాక
దివ్వె వెలుగిడు భాతి ! 3

ప్రతి పరుగిడు పాంధునితో
పరుగు తీస్తి కొంత సేపు
ఇంకయునూ తెలియు లేదు
ఎవరన్నది మార్గదర్శి ! 4

బాధల కలవాటు పడిననవి
సమసి పోవునన్ని చక్కగాను
బాధలెన్నో పైనబడినను
తోచెనవి నాకైతె తేలికగనె ! 5

అట్టహాస ఆనందాలు
అవే ఇంట కళకళలు
శోక సంగీతమైనా సరే
లేవా పెళ్లివాయిద్యాలు ! 6

పనికి మాలిన వానిని
తనను చేసెను ప్రేమ కాని
లేదేని గాలిబు కూడా
కడు సమర్ధుడే కాడా ? 7

అయినదేమి నీకు చూడ
అమాయక సహృదయుడ
నీ బాధకు సరిపోయెడు
మందదేది మానవుడ ! 8

స్వర్గలోక స్వరూపాలు
ఐనా నా కవగతాలు
మనసు నలరింపంగ అవి
మంచి ఆలోచనకు వీలు ! 9

చుట్టు వారి అలక్ష్యాన్ని
చూసి చెడకు ధైర్యాన్ని
ఎవరు నీకు లేకున్నా
మరువకల్లా నీవాడను నిజాన్ని ! 10

ఈ రీతి దీనముగ
జీవితం గడపగ
దేవుడొక డున్నాడని
వీలగునా నమ్మగలుగ ! 11

మత ప్రవక్త తానునిన్ను
మంచి వాడు కాదనెనని
మనసు పాడు చేసుకోకు
మరీ మరీ పరితపించకు
అంతా మంచి వాడనే
అతడొక డుంటాడనే
అనుకుంటావా గాలిబు
తెలియనిదా ఈ మతలబు ! 12

నీవే అల్లా నీవే ఈశ్వర్ ఈసా నీవె కదా
ముస్లిం హిందు ఈసాయీలు భాయి భాయి కదా
వీరి మధ్య ఎందుకీ మత కలహాలో ఖుదా
వీరందరి కైకమత్యం నీవైనా నేర్పరాదా ! 13

తన తప్పు తెలిసినోడు
ఘనమైన బుద్ధిమంతుడు
తప్పులెరిగి నడుచు కొన్న
తానగు మహనీయుడు ! 14

రెప్ప కంటిని కాపాడు
రీతిగా నిశ్చయముగ
ఆలయము నీడలోననె
మధుశాల లుండ నోపు ! 15

కోర నేను పొగడ్తలను
కోరను ఏ బహుమతులను
అర్థహీనాలన్నా నా కవితల
అంతగ నేను పట్టించుకోను ! 16

నా పాపముల సంఖ్యను
నన్నడగకు ఖుదా విను
గుండె మీది గాయాలవి
గుర్తు చేసి ఏడ్పించును ! 17

ఆశ తోడనే ప్రజలు
జీవిస్తారందు రసలు
నాకైతే జీవించే
ఆశే లేదసలు ! 18

ఆకాశం అవల గాని
ఒక ఇల్లది ఉండెనేని
ఆ యెత్తు నుండి తోచును
భూమీ ఓ హరివిల్లు రీతిని ! 19

తలుపులూ గోడలూ లేని
తమాషా ఇల్లొక టుండె నేని
ఎంత బాగు దరవానూ మరి
ఇరుగు పొరుగు ఉండరేని ! 20

స్వర్గం నుండి అవమానించి
ఆదంను ఖుదా పంపించి
నాడని విన్నాను కాని
నాకదే గతాయె నీనుంచి ! 21

వేన వేల కోరికలు పెనవేసుకు పోతున్నవి
ప్రతి కోరిక నా ప్రాణం బాగా తోడేస్తున్నది
అయినా తీరని కోరికలే ఆతిగా నున్నవి
తీరిన వాటికన్నా ఆని నాకనిపిస్తున్నది ! 22

నైరాశ్యం ఎంతగాను
నరకంలా తోస్తున్నది
ప్రేయసి తీపి జ్ఞాపకాలను
వేగంగా మరిపిస్తున్నది ! 23

అందగత్తెల ప్రేమించ
వలె నటన్న ఓ బాబులూ
అందగాళ్లయి మీరుండ
వలె గదోయి తమ్ములూ ! 24

జీవితమొక మోసం
లోనవకో గాలిబు
అంతా భ్రమల వలయం
ఆలోచించుమో సాహిబు ! 25

కళ్లెం లేదు చేతులలో
కాళ్లు లేవు రికాబులో
వయసు గుర్రం దౌడున ఉంది
దాని వేగముగ నీ బ్రదుకుంది ! 26

ఉంటాడా యెవడైనా
గాలిబు నెరుగని వాడు
ఎంతో మంచి కవైనా
చెడ్డ పేరు గల వాడు ! 27

దేవుని సాక్షిగా నేను
తెలిపెద మాట తప్పనని
నిజమే మాట్లాడుతాను
అబద్ధం చెప్పనే చెప్పనని ! 28

శిథిలమైన నాయింట చిత్రమీ హరితము
ఔనుగాదె తాను వచ్చెను వసంతము
శిశిరమే వచ్చెనేని ఈ చిన్ని నా ఇల్లు
అగునాకో ఎన్ని ఆందాల కాలవాలము ! 29

అన్ని చిన్న నేరాలకు
ఉన్నది కాని శిక్షాస్మృతి
చెలి చూపుల కోతలకు
చిన్న శిక్ష లేదేం గతి ! 30

మహర్షి అసదుల్లాను
హర్షింతురు బుద్ధి జీవులు
కలహింప నేరరెవరూ
కామియే ఆయినా తాను ! 31

చిరకాలం జీవించే
సుర మిత్రుల కన్నా
పది మందికి పనికి వచ్చు
మన నరుఁలే మిన్న ! 32

కీర్తి మంతుడసదుల్లా
కవి జనాలలో కెల్లా
నిందింతురతన్ని కూడా
నేరమే చేయ కుండా ! 33

ఇతరుల కపకారము
సుతరాము ఔను నేరము
గతినాది శత్రువులకు
కలుగొద్దని నా మతము ! 34

మూర్ఖులు మాట్లాడక
మూగ నైతి నేను చూడు
నోరు తెరిస్తే నేనిక
నిజమెవడూ నిలువ లేడు ! 35

సలసల కాగుతున్న తైలముల
నరక మందలి వేడి మంటల
కన్న నా హృదిలోని మంటలు
మిన్న అవి లావాలె లావాలు ! 36

ఎక్కడ కామము ఎక్కడ ప్రేమము
ఎంతగ వాటిలో తారతమ్యము
కామికులంతా ప్రేమికులైతే
ప్రేమికులకిక విలువ శూన్యము ! 37

పచ్చదనము నిల్లా మూలము
పరచెనట తాను వసంతము
కాని నేను చూడ నోచ లేదు
కానన పిచ్చితో దూరి నందున ! 38

దౌర్భాగ్యము నాకు లాగ
దాపురించి నప్పుడు
రాతిరే పగలను కొనగ
తప్పదేమి చెప్పుడు ? 39

మిత్రుడొకడు పొరపాటున
ఆమె అందమును వర్ణించెను
నాటి నుండి నా కాతడు
శత్రువు తానై కనిపించెను ! 40

అసదుల్లా ఖానెవరని
ఆమె అడిగెనని వింటిని
తెలుపరా మీరెవరైనా
నేనేమని తెలుప వలెనని ! 41

అది త్రిశంకు స్వర్గము
గానోపు అందు వలన
నాకు సుఖ సౌఖ్యప్రాప్తి
నలుసంత కలుగదాయె ! 42

దేవుడిచ్చిన బ్రదుకు
తిరిగి యిచ్చిన నీకు
ఫలిత మేమి నరుడ
కలుగు నీ ధన్యతకు ! 43

పుండు మానిన దైనను
రక్త మాగనే లేదు
పనులన్నియు నేను దైవో
పహతుడననియే తెలిపె ! 44

పాడు మెంతో కొంత
నేడు గాలిబు సుంత
నీ గజలు లేదేని
నిర్వీర్యం మహఫిలంత ! 45

అనుకుంటా మందరినీ తా
మాప్త మిత్రులేనని – అంతా
సహాయం చేయని వారేలే
దుఃఖం పంచుకోని వారేలే
ఇవేమి స్నేహితాలో
చేతురంతా ఉపదేశాలే ! 46

ఆర్తి జీవన సంహారియని
తెలియుమో బేల మనసా
ప్రణయ దుఃఖము లేదేని
ప్రాపంచికములుండు తెలుసా ! 47

చినుకదెన్ని యిబ్బందులను
చీరి ముత్తెవు చిప్ప చేరును
ప్రతి మంచి పని యందు
ప్రబల యిబ్బంది యెదురగును ! 48

ప్రేమ ఓపిక కోరు
కోర్కె తహ తహ లాడు
ఎడద నే విధి కాతు
కడ తేరు నందాక ! 49

ఎరిగి కిరణ సంస్పర్శ కా
విరై తరించు మంచు
నీదు సంపర్కమునవె
తరియింతు నేను గూడ ! 50

బుద్బుద మీ జీవితము
రెప్పపాటె కదా సోయగము
మిణుగురు పురుగు నాట్యంలా
మితము సుమా బ్రతుకు నిజము ! 51

పుష్ప గీతిని కాను
తంత్రి మూర్ఛన కాను
ఓటమి నుద్భవించిన
ఓ గుండె చప్పుడును ! 52

ప్రేమ ఉచ్చులోన
బిగి సున్న తరుణాన
నామహత్తర శక్తి
నష్టియై పోయినది ! 53

ప్రేమ బాధితుడను
ప్రేమ కోరుటె కాక
ప్రియ సమాగమ
క్రియ కోరుకొందు ! 54

గుండెలో నున్న
రక్తపు చుక్కలన్ని
కంటి నుండి గులాబులై
కారిపోయెను వాగులై ! 55

తుదకు దర్శనమిచ్చి
తమి తీర్చినావు
అందాల కందమా
సాష్టాంగ నమమిదో ! 56

నను పరామర్శించ
నాశ్చర్యమేముంది
బీద యీప్రేమికుని
నాదు కోవలె నీవె ! 57

ధరణి బాధల లోన
తల దూర్చు తుంటాను
బాధ లిన్నిటిని నేను
భరియించ గలిగేన ? 58

శక్తులన్ని నావి అ
సక్తములై పోయె
అవయువాల లోన
ఆ పట్టు లేదాయె ? 59

విరహ సంధ్యలోన
రుధిరము కన్నీరవగ
అవె దివ్వెలై తమసు
నార్పు నను కొంటిని ! 60

అందాల అంగనామణులు
ఐ తాము అప్సరో భామినులు
స్వర్గ మందెదురైరేని
ఔతారు ప్రతీకార పాత్రులు ! 61

గాలిబింకను జనులార
కన్నీరిటుల పెట్టెనేని
మునుగు పల్లెలు పట్టణాలు
మన వేవీ జవజీవాలు ! 62

విరహ వీక్షణ లోన వెర్రిగానేను
వీధి వీధులు తిరిగి నప్పుడు
పిల్ల గాలులు ప్రీతి కబురులు
పిచ్చి పిచ్చిగ చూతు నందున ! 63

పగిలిన నా గుండెనూరడించ
పదుగురు నా యింట ప్రవేశించ
వారి దృష్టి తగులు నేమొ ?
ప్రేయసి వారికి కనిపించ ! 64

నీ కబరీభర మందాభరణాలు
కావు నేను చూస్తున్న అందాలు
కభరీభరమూ – అందులోన
అవి పొందిన ఔన్నత్యాలు ! 65

బండరాయి కాదు గుండె
బాధల కందుకే విలపిస్తుండె
ఒరుల సతాయింపుల కేల
ఓడు రుధిరమీ నాగుండె ? 66

జీవిత నిర్బంధం దుఃఖ శృంఖలం
రెండూ రెండే కదా విడదీయలేం
మరణానికి ముందెలాగు మన
దుఃఖాలను దూరం చేయలేం ! 67

దైవ ప్రార్థన చేయు
తగ ముక్తి కలుగును
మళ్లదే మనసటు
మరి ఎలా చత్తును ! 68

ఇన్ని బాధలు నాకు
ఇచ్చి నావో ఖుదా
తగినన్ని గుండెలను
తగ కూర్చ తెలియదా ? 69

పట్టు పరదాలలో
పగలు చుక్కలు దాగె
బట్ట బయలుగ రాత్రి
పయనించగా సాగె ! 70

అందగత్తెల ప్రేమ లేఖలు
చెలుల కొందరి చిత్రరేఖలు
చచ్చినప్పుడు ఇంట దొరికిన
సంతతీ – నా సర్వ ఆస్తులు ! 71

ఆకులందు మంటలను
అలుకగా చుట్ట వచ్చు
గుండెలందు మంటలను
గోప్యంగా ఉంచలేము ! 72

మానిపోవు గాయమది
మాకొరకై ఉండదది
మరలించి చూడు ఖుదా
మా ప్రత్యర్థుల కది ! 73

బాధలనూ బ్రదుకునూ
భగవంతుని కప్పచెప్పు
బ్రదికిననూ చచ్చిననూ
నీ నిరాశ తగ్గి ఒప్పు ! 74

ఈ రోజు కాక పోవచ్చు
చావేనాడెప్పుడైనా వచ్చు
చావంటే ఎంత వ్యధో
నా గుండె వ్రణం చూడవచ్చు ! 75

వసంతమేతెంచెను
అనంత శోభలతో
సూర్యుడు చంద్రుడునూ
చూచిరాశ్చర్యంతో ! 76

ప్రపంచ మంతయును
పచ్చదనం నిండెనని
ఎచట కాలు మోపలేక
నీట జొచ్చి నిలిచె నాచు ! 77

కనులు దేవు డిచ్చినది
మనము ప్రకృతి అందాలను
మరీ మరీ చూచుటకు
మనోల్లాసం పొందుటకు ! 78

ఉరుదూ భాషా స్రష్టవు
ఒక్క నీవే కాదు గాలిబు
ముందు కొందరనే వాళ్లు
'మీర్' అని ఒకడుండే వాడని ! 79

నా కవితలు వినివిని
ఆమె అందమూహించుకొని
స్నేహితుడే ఒకనాడు
శత్రువుగా మారి పోయె ! 80

అకుంఠిత నమ్మకం
నిష్ఠా విశ్వాసాల సారం
కాబాలో అంత్యక్రియలు
కావింపదగు బ్రాహ్మడు
చస్తేనేం అతడు తన
చల్లని ఆగుడి ఒడిలో ! 81

మా ప్రార్ధన లన్నీ
మదిరా మగువలతో
మైల పడిన వనకుండా
పుణ్యాత్ములెవరైనా
పోయి స్వర్గ లోకాన్ని
నరకం లోకి త్రోయరా ! 82

అన్నిటా నీవు
ఉన్నా వంటారు
ఎచ్చోటా ఎవ్వరూ
నిన్ను చూసి ఎరుగరు ! 83

భువిపై ఆనందం
చవిచూడని వారికై
స్వర్గ సుఖాలంటారు
చచ్చిన తదనంతరం
అదేం గొప్ప బహుమానం
మేమూ దాని కర్థులం
మత్తుగ త్రాగినాక
మైకంలోని ఆనందం
మరీ తక్కువే కదా
మగత ఇచ్చు నొప్పి ముందు ! 84

అందం గుఱించి ఆలోచించడమే
అందమైన పని నే చేసిందండి
అందుకే స్వర్గం తెరిచిందో
ద్వారం నా సమాధి లోనుండి ! 85

ఆశయే మానవుణ్ణి
గమ్యం వేపు నడుపుతుంది
మరణమే లేకుంటే
బ్రదుకుటకే దాకర్షణ ! 86

బాధల తరంగాలు
పాఠశాల లాంటివి
ప్రతి తెప్పా అందులోన
గురువు చెంపదెబ్బ ! 87

ధనం నిండి జగముంటే
దాతలు లేనే లేనట్లే
మధువు నిండి మధుశాలుంటే
మధుపాయిలు లేనట్లే ! 88

ప్రార్థనవే కోరికగా
పరమ మూర్ఖులంటారు
కరుణ లేని కాంతను
ఎలా పూజింతు నంటారు ? 89

చెడుమాటాడిన వినకు
చెడు మాటకు నోరు విప్పకు
చెడు నడతల ప్రతి ఘటించు
కడు క్షమ చూపు మితరులకు ! 90

మేలొనర్చిన గూడ తూలనాడు
పాడు జగమిది భద్రముగ నుండు ! 91

వేల రోగముల కున్నవౌషధములు
ప్రేమ రోగమునకె లేవే యే మందులు ! 92

పడతి కన్నెర చూపు బ్రదుక నీయదు
చత్త మన్నా కూడ చావనీయదు ! 93

సుందరాంగుల తోడ సుద్దులాడుట కని
చిత్రపటములు గీయ సిద్ధ పడితిని కూడ !

తప్పు చేయువాణ్ణి దండించి నట్టుల
తప్పు చేయునపుడు మెప్పులీయరేల ? 95

వెలుగు దివ్వె కగునే విధి
ప్రేమ జీవితాని కావిధి ! 96

కాబాకే ముఖంతో వెళ్తావు
గాలిబా నీకు సిగ్గెగ్గులు లేవు ! 97

దీవన అంటే ఏమిటో
తెలియ కున్ననూ నేను
ప్రభువా నీకై నేను సదా
ప్రాణాన్నే ఆర్పిస్తాను ! 98

కనుల నిండ మేఘాలు
కమ్మి ఉన్నవో గాలిబు
నన్ను మందలించితే చాలు
అన్నీ జలపాతాలే సాహిబు ! 99

మరణ మెప్పుడో దాని
మనసైనప్పుడు వచ్చు
నిదురకేం రోగమని
నిసి యెల్లా ఏడిపించు ! 100

కారణ ముందనే నేను
నోరే మాత్రం తెరువను
అంత మాత్రాన అనుకోవద్దు
అసదుల్లాకు మాటలు రావని ! 101

గాలిబు కవికన్నా బాగా
కవితలు చేసే వారలు
ఉన్నారనుకున్నా ఏ కవితలిలా
ఊప లేవు ఉర్రూతలు ! 102

మంచం పట్టితినా నేను
మందలించ వద్దెవరు
చచ్చి పోతినా నేను
వచ్చి యేడ్వ వద్దెవరూ ! 103

తలను భూమికాన్చ
గల శక్తి లేదైన
నీకు తప్ప నేను
తలను వంచ లేను ! 104

మసీదు పక్కింట్లో
వసిస్తున్నాను నేను
అల్లాకే పొరుగు వాణ్ణి
అయినట్లే కదా నేను ! 105

లేదా

అల్లాకు దగ్గరై మరీ
ఆనందిస్తూ ఉన్నాను !

ప్రతి మజిలీలో కొందరు
పాంథులు వెనక్కి మళ్ళారు
సాక్కి నిన్ను చేర లేక
చేయు గలది లేక వారు ! 106

ప్రకృతి లోన అణువణువూ
నాణ్యంగా నర్తించేదే
పరమాత్ముని వైభవాన్ని
ప్రాభవాన్ని చాటేదే ! 107

ఇన్ని రూపములు కల్పించి
ఏకేశ్వరుని పూజించుటే
ఉన్నాడా దేవుడనే వాడని
కొందరు నమ్మ కుండుటే ! 108

వసంతంలో పూదోట
వైభవంగ ఉన్నట్లే
అపవిత్రత కనిననే
పవిత్రత సుస్పష్టం ! 109

మనమతమ్మైకమత్యం
ఆచారాలను విడువాలి మనం
మతాలన్ని మరుగయితేనే
సన్మత ముద్భవించు తానే ! 110

ప్రతి నీ మంచికి తప్పక
ప్రబలంగా పురస్కారం కోరే
భావం నీకున్నంత సేపు
పవిత్రుడవు కాలేవు ! 111

సృష్టికి ముందటి
ఆ పెను చీకటి
కన్న ముందూ తానున్న
ఈశ్వరుడు మహా మేటి ! 112

చీకటులను చిత్తు చేసి
కాంతి హేల కలుగ చేసి
విశ్వభవుడు దివ్యుడాయె
విశ్వాంతరాళ సృష్టి చేసి ! 113

నిర్లక్ష్య వీక్షణాలతో
నేడు ప్రేయసి కలిసెను
ప్రేమ రసంలో ఈదుతూ
పోతున్నట్లనిపించెను !

పిచ్చుకా కూలిన గూటిని
రెచ్చి మరీ కడుతూ పో
పిడుగదే విసుక్కుని
పడడం మానును పో !

గాలే ఆర్ధముతానై
కాపాడే లాంతరును
ఆర్ప గలుగు తాడెవ్వడు
అల్లా వెలిగించే వత్తిని!

# మధుపాంయి

నాముందర మధు చషకము
నాట్యమాడు చున్నదా
నా కవితల సోయగము
నా దివాను నింపదా ? 114

మధు పాత్ర చేయి తగిలిన
మరీ ఆహ్లాదమౌ జీవితం
వాని హస్త రేఖలు తంత్రులై
బ్రదుకు చైతన్య వంతమగు ! 115

ప్రతి క్షణమూ భగవంతుని
తల వాలని మదినున్నా
మధు ధారల మాటెత్తుట
మరువ లేక పోతున్నా ! 116

పొడ నాది గిట్టదా
పోయుకు చషకాన
దోసిలి నింపవే
తృప్తిగా తాగ్రెదను ! 117

కొంగ్రొత్త కోరికల
కొత్త ప్రేమికులార
కైత మదిరా మగువల
కై తపించండిర ! 118

గాలంతా నిండినది
గాలిబా మధువుతో
పీల్చి తూలి పోవచ్చు
పనింకేమి చషకంతో ! 119

సాఖీ క్షమించు కాస్త
శ్రమే అనుకో ఐనా
నింపడం ఆపు కాస్త
ఆలోచనల ముంపులో నేనున్నా ! 120

మధుపానం చేయునానందం కొఱకు
వ్యధల మరువనే పూనితి తాగుటకు ! 121

మధువూ మధు పాత్ర ఉంది
మరి పంచే సాఖీ ఏది
ఇంకెందుకు పానశాల
అగ్గిడనా అవగ బూది ! 122

మద్యపానం పై నీవు పెట్టిన ఒట్టు
నీపై మానమ్మకానికో గొడ్డలిపెట్టు ! 123

పానశాలలో లేదా కూర్చొని తాగుటకు
పాఠశాల, గుడి, మసీదు అన్నీ ఒకటే నాకు ! 124

మధువు దినరాత్రములు మానోట పారుచుండ
మధుర కవితలె కదా మేము వ్రాయగలము ! 125

మధువు మానెదనని మరీమరి
ప్రతిన బూనితివే కాని గాలిబు
మానగలిగితివా నీ వెప్పుడైన
నమ్మ నెట్టుల నీ ప్రగల్భాలో సాహిబు ! 126

చషకము క్షణ క్షణము
నింపగా సాఖి నీ కొచ్చు నీరసము
బానతో నేకముగ
పెదవి చేర్చ రాదటే మధురసము ! 127

చేతికి మధుపాత్రను
చేరు శక్తి లేకున్నను
కనులు చూడకలవు కదా
కలశ ముచటె ఉండ నిండు ! 128

ఎక్కడ మత గురువు
ఎక్కడ మధుశాల ఐనా
చిత్తుగ త్రాగి నే దిగుతుంటే
ఎక్కదొడగె తాను మెట్లు నిన్న ! 129

ఆకసము బోర్ల పడిన
మధు చషకమటు లుండు
అట్టి తరి దానియందున
గోస్తనీ రస మెటులుండు ! 130

ఇంకేం ప్రియ బాంధవి
ఇంకేం మధు చషకము
లే లే ఏతెంచెను
జీవితాన సాయంత్రము ! 131

పాత పదాలిస్తాయనంతం
పంక్తి పంక్తికీ కొత్తర్థం
పదాల ఈ ప్రపంచం
అక్షయ మధుకలశం ! 132

తనకు తగిలిన పని
తాను వెంటనే కని
చేయ బూనెనా తను
వెప్పొచ్చు దైవ లీలయని!

కాలపు మండు టెండ
బాధల ముళ్ల దారి
ఆలోచన నీడలలో
ఆశలు తీరేదెలా మరి !

# ప్రేమ - ప్రేయసి

నా ప్రేయసి వచ్చు వార్త
నమ్మికగా తెలిసె నాకు
ఇంటి యందు నేడో చాపయు
కంటనే పడదాయె ! 133

నిట్టూర్పుకో యుగము
నెట్టు కొచ్చుట కవసరము
ఎవరు జీవిస్తారగు వరకు
నీ కురుల సాధనము ! 134

కురుల నలంకరించు
కొనుచు నీవానందించు
పరిణామ మేమగునను
ప్రశ్న నన్ను పరితపించు ! 135

వ్యర్థుడనని ప్రేయసి తాను
వ్యవహరించునటన్న
ఇల్లు దోచి ఈ రీతిగ
ఇవ్వ కుండెడి వాణ్ణి ! 136

మట్టిలో కలిసిన కొందరు
సుందరీ మణులు తిరిగి
పూవులై తాము జన్మింత్రు
పునః పునరపి తరియింత్రు ! 137

పరదా తన అందాన్ని
పదిరెట్లుగ హెచ్చించెను
కురుల అంద చందాల్ని
కోటి రెట్లుగా పెంచెను ! 138

చిత్తుగ త్రాగి ఓ నిసి
మత్తు కనుల నా ప్రేయసి
ఒక్కతయే వచ్చునట్లు
ఖుదా చూడు దయచేసి ! 139

ప్రణయ మంత బూటకం
కలుగు నెట్లు విశ్వాసం
తల పగుల కొట్టుకునేందుకు
నీ గడపే ఏమవసరం ! 140

ప్రేమలోన నే నేవిధి
మునిగి యున్నానన్నది
మీకు మాత్రమే కాదు
నాకూ తెలియకున్నది ! 141

అరుదెంచెద త్వరగానని
ఆశ పెట్టితివి మానిని
ఆజన్మాంత మప్పజెప్పితివి
నా వాకిలి కావలిని ! 142

ఆమె ఇంటి గోడ నీడను
అరుగు పై కూర్చొని నేను
భారత దేశ చక్రవర్తను
భావముతో మురియు వాడను ! 143

ఆమె అందం సౌభాగ్యం
ఏమని నేను చెప్పను
అంతా నీదే దౌర్భాగ్యం
ఎటుల గుట్టు విప్పను ? 144

విని పించాలనుకున్నా నా మనోవ్యథను
వినక అదే పనిగా విమర్శించు నామెకు
ఎలా ఏమైనా విన్నవించుకోగలను
ఎలాగైనా నమ్మించ గలనా చివరకు ! 145

గుండె దొంగిలించి
సఖి బండ బారెను
తగ చిచ్చు రగిలించి
తను ప్రియుమాయెను ! 146

గుండె మీద గాయాలు
ఉండె నిన్ని దినాలు
నిండు పుండయి నేడు
తెరిచె స్వర్గ ద్వారాలు ! 147

గుండె పగిలెను కనుక
కొంత కలిగెను కినుక
కాని జీవిత మెల్ల
కలిగింది నిమ్మళము ! 148

ఆవేదనా తాప జ్వరము
నోరంతా చేదు నిజము
మందొకటే తీపి ముద్దుల
చెలి ఆధరామృతము ! 149

నీ కురుల నిడివి నీకన్నను
నిక్కముగా ఎక్కువేలే
అంతగా మిడిసి పడకు
అవి ఎవనికి పనికొచ్చునులే ! 150

ఎటులో ఏ తీరుగనో
నేనామెను చేరుదునో
నన్ను చూసి నాంకనైన
సన్నుతాంగి కరుగునో ? 151

ఆమె కనబడి నంత
వికసించె నా ముఖము
ఆమె నా జబ్బంత
అయె ననుకొనె నయము ! 152

ప్రేమ బాధితులను మనము
ఏమనోదార్చ గలము
శిరము నుండి పాదాంతము
వరకూ బాధా మయము ! 153

ప్రేమ కొలిమిన బడి
ఆమె చిక్కెను వడి వడి
చిక్కె నెంతగ నామె
చక్క నమ్మాయెను ! 154

నీ జవాబు చూసి
నేను సంతస మొందను
తెచ్చి నోణ్ణి చూసి
తిక్క ఈర్ష్య కలిగెను ! 155

ఎన్నిజన్మలదమ్మ బంధము
దీన్ని ఎపుడూ త్రెంచ బోకుము
ప్రేమ జల్లు కురిపించ కున్నా
ద్వేషమైననూ ఒల్క బోయుము ! 156

కాళ్లు ఒత్తమని కాంత కోరె నటంచు
సిద్ధ పడితిని శీఘ్రమే చేతు నంచు
కాని సంతోషాన కాస్త చేతులు నావి
ఉబ్బి తబ్బిబ్బయ్యె ఒత్తలేమటంచు ! 157

మోసగాళ్ల మాటలువిని
మురిసిపోవు సఖితాను
అచ్చుపు నామాట చెవిని
అసలెపుడూ పెట్టదాయెను ! 158

కఠిన హృదయగ పేరు మోసిన
కాంత తోనే ప్రియము కలుగుట
అంతకన్నా ఘోర నేరము
బ్రహ్మ తానూ చేయి కలుపుట ! 159

పెదవులితరులకు నీవు
సుదతి ఇత్తువు కాదె
పెదవు లున్నవి నాకు కూడా
కదలి రావే ముద్దులివ్వ ! 160

ప్రేమ పిచ్చిలోన
ప్రతిసారి నీ వీధి
జొచ్చి ఆపై నేడ్తు
వచ్చితి నిట కేలనని ! 161

అడుగ ధైర్యము లేక
అర్థ వయసు గడిచె
అడిగి నాంక జవాబు
కా అర్థమూ అగునో ? 162

ప్రేమలో పలుమార్లు
పిచ్చోడ నయి నేను
పాప మీ చౌక్కాను
పీలికలు చేశాను ! 163

గుండె యందున నీవె
గుచ్చుగా చురకత్తి
ఇంక నా భాగ్యాన్ని
ఎచట పరిశీలింతు ! 164

ఆమె ప్రేమికులందరు
అధర రస లోలురు
ఎంత తిట్టిన గాని
సుంత దూరము పోరు ! 165

ప్రేయసిని పొందు భాగ్యము
పొసగదాయె యే మాత్రము
ఎంత కాల మిక బ్రతికిన
ఎదురు చూపె గతి మాత్రము ! 166

వత్తునను నీ వాగ్దానము
ఒట్టిదని తెలిసె తుదకు
సంతసాన చచ్చువాడను
సుంత ముందు తెలియ నాకు ! 167

నీ లాగే వాగ్దానాలు
నిజంగానే కోమలాలు
అందుకనే వాటిని నీ
వవలీలగ త్రెంచటాలు ! 168

ఓరచూపు నీ బాణం
గుండె దూసి బైటి కొస్తే
ప్రణయ వేదన లోని
మధుర బాధయె లేదు ! 169

ప్రణయమున నిరంతరం
పరితపించు నా హృదయం
ఇపుడు చూడ నేలనో
ఆశ (స)క్తే లేదు నిజం ! 170

అన్ని శక్తులుడిగి పోయి
నిన్ను పొందు ఆశ పోయి
క్షీణ దశా శత గాత్రుడ
మరణ మార్గ మేమిటోయి ! 171

ఐహిక బంధా లెన్నున్నా
అందు దేహం చిక్కుకున్నా
నిన్ను చేయను నిర్లక్ష్యం
నన్ను నమ్ముమో నేస్తం ! 172

ప్రణయ మన్న నాకు
భయము లేనే లేదు
నేను గర్వించు ఆ గుండె
ఇపుడు లేనే లేదు ! 173

అసూయ కారణానే
నడుగను నీ చిరునామా
ఎచటికెళ్ళ వలెననే
ఎదర పడ్డవారి నడిగెద ! 174

నీ ఇంటికని నేను
నీ వీధిలో నున్న
శత్రు వింటికి పోతి
శత సహస్రము సార్లు ! 175

అందరు నాలాగ కళా
రాధకులను కున్నాను
విషయలోలు రంతాయను
విషయం తెలుసు కున్నాను ! 176

సరస సల్లాప సభలందు
సంతసముగ పాల్గొంటిని
జ్ఞాపకమే లేని గతం
కనుమరుగైనట్టి నిజం ! 177

పగటి ఎండ తీక్షతలా
మండు మగువ సౌందర్యం
మరి తానెందు కలా
పరదాలో ముఖం దాచడం ! 178

ఎరిగిన నా ఆశీస్సుల్ని
దరబాన్కప్పు జెప్పితి నన్ని
ప్రేయసి కిచ్చుట కేమాత్రం
మిగల్లే దాశీస్సులిన్ని ! 179

ప్రేమ చూడ అదో జ్వాల
తెలియ రాదు దాని లీల
మనమసలంటించ లేము
అంటు కొన్న ఆర్పలేము ! 180

వికసించెడు ఆ కుసమం
వీక్షణ కాదు కోరడం
ఆసక్తిగ కోరుతాను
అధరాధర సమాగమం ! 181

ప్రేయసి వలపులు వంపులు
సోయగాలు ఆ హొయలు
మన హృదయాలను దోచెడు
మహో కళా కౌశలాలు ! 182

సౌందర్యారాధన
సాధ్యమా అందరికి
సౌందర్యం నలపడమే
సంతోషం ఎల్లరికీ
వాసన సౌందర్యో
పాసన ఎట్లగును
వారెవరో వీరెవరో
వాక్రుచ్చుట కష్టమగును ! 183

అరయుడామె ఆ చందం
అభిభాషణ ఆ అందం
అన్ని భావాలు నావేగా
అని కలిగెను ఆనందం ! 184

నీ చూపుల చురకత్తులు
నీ అందపు నిర్దయ శరములు
నీ ప్రతి బింబాలే ఐనను
నీ ముందు కేల రావలెను ! 185

ఎంత నేను మొర పెట్టినను
సుంత రాదు ప్రేయసి తను
అల్లా నీవో మాయ చేసి
ఆమెను కరుణ చూపమను ! 186

ప్రేమంటే తెలియని
ఓ ముద్దు మొఖముతో
ప్రేమలో పడితిని
ఓ పిచ్చి మోజుతో ! 187

గుండె ఊసు వ్రాసి వ్రాసి
చేతి వేళ్లు రక్త మొడిసి
ఎర్ర బడిన అక్షరాలు
ఏమనునో ప్రేయసి చూసి ! 188

బాధల కన్నిటికీ కారణం
భామా నీవేనని చెప్పాలని
నిర్ణయించు కొంటే మాత్రం
నిందించ గలనా నిన్ను నేను ! 189

విర బోసిన నీ కురులవే
బిగి కౌగిలి యందుంటే
అన్ని అందాలతనివే
నిన్ను స్వంతం చేసుకుంటే ! 190

అసదుల్లా చెలిని నీవు
ఆటైనా పట్టించు
సంభోగం కాదా కనీసం
సయ్యాటతో సరిపుచ్చు ! 191

నా రొమ్ము భాగాన
నలతగా ఉందని
పరికించగా తెలిసె
గుండె ముల్కులమయమని ! 192

గుండె మీద గోళ్లు
వేసె నాగేటి చాళ్లు
వచ్చె వసంత మని
పండించుటకు బీళ్లు ! 193

పాదముద్రలు నీవి
కనిపించు ప్రతి చోట
కారడవు లందయిన
కనెద పూదోటలే ! 194

అందగత్తె ప్రేయసులు
అందరూ మోసగత్తెలు
చేరి దారి మళ్లిస్తాయి
వారి తీయని మాటలు ! 195

ముదిమి తోని నేను
మూగ వాణ్ణైనాక
ముదిత అడిగె నన్ను
మోహాలు తెలుపమని ! 196

నిన్ను నా ప్రాణమని
అన్నది గుర్తు చేయకు
నా ప్రాణం పైనే చూడ
విసుగు నిండి ఉంది నాకు ! 197

నిబ్బరమూ నీమముల
నిద్దరమూ పాటిస్తే
కలుసు కొనుట కన్న
విరహం కాదా మిన్న ! 198

ప్రియుడు విజృంభిస్తే
ప్రియురాలు దూసుకొస్తే
మమైక్యం మాధుర్యం
ప్రపంచాన్నే మరిచేస్తే ! 199

కలలందోదార్చ
కలదేమో ప్రేయసి
గుండె నొప్పి కాస్త తగ్గి
కునుకు పట్టితే కదా ? 200

లేవదీసె వాడామెను
వానిదనను మక్కువ
ప్రేమ లేఖ లన్ని నేను
పంపడమే బుద్ధి తక్కువ ! 201

ప్రేమలో పడిన వారికి
లేదు చావు బతుకుల్లో తేడా
ఎవరికై పడి చస్తారో
వారి కౌఁగిలికె బ్రదుకుతారు ! 202

కలలోనైన కన్పడి సఖీ ఓదార్చు
కాస్త నిదురే లేదాయె కలలేల వచ్చు ! 203

పూల వాసనల కొకప్పుడు పులకించు నేను
పూల పేరెత్త నా కిపుడు పిచ్చి రెచ్చేను ! 204

తాను వేరింటి దీపమై ప్రజ్వలించె
నాకు మరు క్షణము నందె మతి చెలించె ! 205

రొమ్ముమెత్తి నడుచు చెలియె
మరుల చిక్కుల కూరు కొనియె ! 206

వస్తానని మాట యిచ్చె
సఖి కాని ఎపుడో చెప్పదు
వచ్చినా రాకున్నా గాని
నాకు ఎదురు చూపు తప్పదు ! 207

ఏమి ఆయుమ నిడివైన ఆ కురులు
ప్రేమికుల గొంతులకు బహుగట్టి ఉరులు ! 208

ప్రేమ పిచ్చిలోన ఏమి కన్పడకుంది
నలుసు రీతి కనుల నస అయ్యి కూర్చుంది ! 209

ఆమె నాహ్వానిద్దామా
అదేం చిత్త వికారమా
పిల్లా పాపా లేనిది
అల్లా ఇదీ జీవితమా ! 210

ఆమె మంచి దైతేనేం
కోమల మామె బాహువులు
చేతి కందె ఐతేనం
చేయి జారె ఆ చేతులు ! 211

ఏమమాయకత్వం
ఆమె చూపుల తత్త్వం !
చేత కత్తి లేకుండానే
చేస్తోందిలే యుద్ధం ! 212

హృదయం నీ కివ్వకున్న
సదయమ్ముగ బ్రతుకు వాడ !
ఈ రీతిగ చావకున్న
ఇంకా నిట్టూర్చు వాడ ! 213

అర్థం నా మాటకు
ఆమెకసలె తెలియదు
ఆమెకు నచ్చ చెప్పు
అల్లా ఏడ్పించొద్దని ! 214

అన్నీ వదులు కున్నాను
ఆమె జ్ఞాపకాలు తప్ప
అస్తిత్వం లేకున్నా
ఆమె గుర్తు లుండ నిండు !

పిడుగుకు పుట్టుకతో స్వభావం
పిట్టగూడు పైన పడడం
అపార్థం చేసుకోవద్దు
అండజాలూ కాదదేం చోద్యం !

ఆవులింత తీయుటకై
ఆమె చేతు లెత్తపైకి
ఆ అందం జుర్రుటకై
అటే చూసె నో లేకి !

కవితల పూలు రాలెనా
అవి కొందరేరు కుంటారు
వినే వారు వింటారు
కవిగారు పాడుతుండెనా !

# విరహం - నిరాశ - మరణం

ప్రేయసి వెళ్ళ దారే యిది
వేచి నేను కూర్చున్నది
లేచి పోవనేల నేను
గుడి మసీదు ఎవడి గడప కాదిది ! 215

విరహ తాపాన హృదయము
కొర కొర యను చున్నను
మరువ లేదు ఆలింగనము
మాన తలువ లేదు సంభోగము ! 216

విరహ బాధ లోన
వెడలె నశ్రువు లిన్ని
నిండి ఇంటి నెల్ల
నేల మట్టము చేసె ! 217

బాధ ఔషధ గుణము
బడయునే లేదాయె
అదియు మంచికె కదా
అకృతజ్ఞత లేదాయె ! 218

విరహ నిశీధి యెంత గాను
కొర కొర యని చెప్పను
చావు ఒకసారే తనొస్తే
చక్కగా ఒడి చేర్చు వాడను ! 219

కష్టసుఖముల మయము
కాదె మన ఈ జగము
సుఖము లెమ్మై పోయెను
కష్టాలయె నా భాగము ! 220

విరహ సంధ్యలోన
రుధిరము కన్నీరవగ
అవె దివ్వెలై తమసు
నార్పునను కొంటిని ! 221

రాళ్ల ఆ నరాల నుండి
రక్త ధార చిమ్మేనేని
ఆగదది యే మాత్రం
బాధా తప్త అగ్నిధార ! 222

ఎవరితో యిక చెప్పను
నా ఈ దురదృష్టమును
మరణము కూడా తాను
దూరమవ్వ చూడ నన్ను ! 223

విరహము భరించలేక
చావ దలచిన నదియు రాక
దౌర్భాగ్యుడు పడే బాధ
ఏడ్వకుండ ఉండ లేమిక ! 224

ఆ పగలు రాత్రులు లేవు
ఆ నెలలు ఏండ్లూ లేవు
ఆ విరహమూ లేదు
ఆ కలయికలు లేవు ! 225

ప్రణయ కలాపానికి
జవ్వన మది లేదు
సౌందర్యమును గ్రోల
క్షణము తీరిక లేదు ! 226

హృదయమే కాదు ఈ
మెదడూ పని చేయునంది
మదిని యే అందమహో
కదిలించ లేకుంది ! 227

నా మది భావాలు
తన చుట్టు భ్రమరించె
తను లేని తరుణాన
తము భావములు సమసె ! 228

ఇంక సులభము కాదు
రక్తాశ్రువులు చింద
గుండె బలముడిగి తను
బండ బారెను గుండె ! 229

కోరికలు తీరక జీవితాన
మరణము నాశించు కతన
నిరాశా నిట్టూర్పుల వ్యధ
చూడ గలమే అట్టి ముఖాన ! 230

క్రుంగె హృదయం కాలేయం
రెంటి కోసం ఏడ్పాయెను
సహాశోకిని పెట్టుకొనే
శక్తి నాకు లేదాయెను ! 231

అన్ని బాధలు నేను
అనుభవించి నాను
ఆకస్మిక మరణమనే
తరుణ మొకటే మిగిలెను ! 232

తీరకనే కోరిక లేవి
తిరిగి వీడు చుంటి భువిని
ఇహ ఆరిన ఈ దీపం
మహాఫిలుకే విధి ఛవి ! 233

చివరి ఘడియలోన
చెలి లేఖ పంపిన
చదువ కుండనె దాన్ని
చచ్చితి నెద నుంచి ! 234

నన్ను మఱచిన దేల
నని అడుగ సఖిని
కామ చూపుల చూసి
కాల్చి భస్మము చేసె ! 235

కాలి భస్మమైతి
కలువ లేకనె నిన్ను
సంతస వసంతాలె
సదా నీకు తోడవాలె ! 236

నేను మరణించాక
తాను దురపిల్లె సఖి
నిష్ప్రయోజన మయ్యె
నెలతాశ్రు ముత్తెములు ! 237

లేడు గాలిబు ఇకపైన లేనె లేడు
ప్రణయ సమ్రాట్టు ఆ మధుపాయి లేడు
ఎంతలేసి సౌందర్య పిపాసి తాను
అంత దీనముగా మరణించినాడు ! 238

స్వతంత్రుడు స్వాభిమాని గాలిబు
నిరు పేదగా బ్రదుకు నీడ్చె సాహిబు
చివరికి శవం మీద కప్పుటకో
చిన్న గుడ్డ లేకనే చచ్చెనా గరీబు ! 239

పదే పదే నా సమాధి
పై బడి అంతా ఆడి –
పోసుకునే వారేనన్ను
విరహాన చచ్చినాంక ! 240

నీట కొట్టుక పోయి
నేను చచ్చితి నేని
లేక పోవు శవయాత్ర
లేకుండెడిదీ సమాధి ! 241

కల్లబొల్లి మీ యేడ్పులు
కావా బూటక సంతాపాలు
అసదుల్లా చని పోతే
ఆగి పోవు ఏ పనులు ! 242

చావు వచ్చి రక్షించింది
చాలా దూర దేశంలో
స్నేహితులే లేరనే
చేదు నిజం నింద నుండి ! 243

బాధలను తట్టు కోలేక
మరణము నాశ్రయించాక
ఆపై వెళ్ల నెచటికి
అయిననూ శాంతి లేక ! 244

కొలది రోజు లింక
గాలిబా బ్రదికుంటె
వచ్చి యుండెడి దేమొ
భ్రమ వీడి ప్రేయసి ! 245

ఎంతో కాలమైనా గాలిబు తాను చనిపోయి
గురుతు వచ్చునా మహనీయుని మాటలోయి
'ఈ కోరిక తీరితే ఎంత బాగుండేది ?
ఇది తీరిన ఎవరికి నష్టం కలిగెడి దోయి ?' 246

మనస్సును శోధించుకో
మరింకెందుకు హితబోధ
నీవే నీ హితవరనుకో
నీ కుండ దింకేం బాధ !

చెల్లని నాణాలే నేడెక్కువ
చలామణీ లో నున్నవి
చిక్కనిదే శాంతి ఇక్కడ
చింతలు లోటే లేనివి !

# ఆ అన్నకు తమ్ములు అర్పణకు అర్ఘ్యాలు

కవిగారి గజలు సుందరిని
కవి సమ్రాట్ కందించితిని
కవిరాజ సోదరులూ
కవితా విహాయసులూ
మీ మీ కవితాను వాదాలను
మీ కర్పణ మొదట చేసెదను
మన మందరము మరల
మన కవితల సుందరిని
అసదుల్లా ఖానుకే తిరిగి
అర్పించెదము హృదిపెరిగి
అతని తమ్ముల మాట
అదృష్టమే కదా
అంత కన్నా మనకు
ఆదర మున్నదా
ఆ సుందరుడె కదా
ఈ సుందరికి దీటు !

# నూట పాతిక మంది

# ఉర్దూ కవిరాజులు

ప్రతి కవీ ఓ గొప్ప భావకుడు
పదాలతో భలే గారడీ చేయిస్తాడు
భావాల విషయాని కొస్తే తాను
పరమ ప్రియుడూ తాత్వికుడనిపిస్తాడు !

# మీర్ తఖీ మీర్

(1722 - 1808)

ఊపుతూనే ఉండె దీపం
రాతిరంతా తలను పాపం
చెవిని పురుగది ఏమి చెప్పెనొ
ఏమి ఆశలు రగుల్కొలిపెనొ ?

ఏమనేడ్చును తాను దీపం
తనువు విడిచే పురుగు కోసం
తెలిసి - ఆర్పే వెలుగు వైపుకు
పరుగు తీసే రాత్రి వైనం !

ఏమి దృశ్యము చూడ ముచ్చట
గుండె గాయము కూడ నిచ్చట
ఏమి సౌధము దాని విభవము
బాధ లెత్తిన మహా భవనము !

మీర్ చూడుము నేటి అడవులు
నిన్న ఇవియే మేటి నగరులు !

వెలవెల బోయిన నీ మోము
అలాగ చిక్కిన నీ తనువు
ప్రణయ మెంతగ క్రుంగ దీసెను
కాంచి నావా కవీ ఓ మీర్ !

తారలను బోలు తళుకు కన్నులు
తన్మయుల చేయు కనుల సైగలు
ఏమనందును అద్భుతాలవి
ఆమె మోహపు రెప్ప పాటులు !

ఎవరికి పట్టిన యాత్రలివేల
మక్కా కాబాల మాటలవేల
దూరం నుండే చెల్లిస్తారు మొక్కులు
ప్రేమికులకు ప్రేమే పెద్ద కోవెల !

ఏమి కోమల మామె పెదవులు
పోలెనవి చూడు గులాబి రేకులు !

వచ్చెనట వసంతము రండి రండి
తోటలో కెళ్లి కాంచెదము పదండి
హరిత దారులు విరియు పూవులు
పిల్ల గాలులు, చిట్టి చినుకుల చిత్త జల్లులు !

సంజకన్న ముందె
చావు కళయుందుండె
బీదదా దీపమీ
పిచ్చి నాదు గుండె !

ప్రేమనేమని నిర్వచింతుము
ప్రేమ దివ్యము ప్రేమ దైవము
ప్రేమ సత్యము ప్రేమ నిత్యము
ప్రేమ గుండెను కాచు ప్రాణము
ప్రేమ బాధల కాల వాలము
ప్రేమ కుండుము దూర దూరము
ప్రేమ వేదన ప్రేమ దుఃఖము
భీతి హేతువు హింస భరితము
ఇన్ని రీతుల ప్రేమ వర్ధిలు
సున్నితంగా అందు మసలు !

ఏడ్పుటొక్కటె బ్రతుకున
ఎరుగుదువ మిత్రమా
ఆపుమిక చాల్చాలు
ఆపు మా కన్నీరు
ఎన్ని నాళ్లల్లెదవు
ముత్యాల సరులు
ఎన్ని నాళ్లని తుడువ
కన్నీళ్ల పాతములు !

సభలో ప్రేయసి ఛమక్కున ప్రవేశించె
అంతే ! దీపాలన్నిటిలో వెలుగు నశించె !

పునరా వాసానికి
పనికి రాని నగరం
పాడు పడితె నా గుండె
పశ్చాత్తాపమె నీ పరం !

పరమ నాస్తికుడు
తెలుసా మీర్ వాడు
ప్రేమ మతం పుచ్చుకొని
ప్రేమికుడై పోయినాడు !

ఆగి ఆగి ఆగుతాయి అశ్రువులు
ఏడుపు మాత్రం కాని నవ్వులు !

తొలి ప్రేమ లోననే
త్రుళ్లి యేడుతు వేల
మున్ముందు యేమౌనా
కాచుకోరా బేల !

గొప్ప తీపి రసమిదండి
తప్పుతాగి నానండి
చెప్పినాను పాపాన్ని
తప్పైతే క్షమించండి !

త్రాగడం తప్పు కాదు
తూలడమే తెగ నేరం
పానశాల రివాజులు
పూని తెలుసుకో నేస్తం !

క్షమించండి స్నేహితులారా
కాస్త తూలుతున్నాను
కలశంలో(మధువు)$^2$లో మత్తు
మత్తులో నేనున్నాను !

మతగురువా మసీదు నీకు
మరి చూశావా మధుశాల నాకు
పైవాడు న్యాయంగా కర్మఫలం
పంచుతాడు తాను మనకు !

మరణించిననూ నాకెప్పుడూ
మధుశాలతో బంధం తీరదు
నావంతు మధు వెల్లప్పుడూ
నన్ను చేరు ఒలికి ఒలికి !

దుఃఖిలు నపుడే వెన్నెల
దొంతరలే కనిపిస్తవి
భాగ్య నగర మందే ఎన్నో
బీద అరుపులినిపిస్తవి !

# వలీ మొహమ్మద్ వలీ
(1667-1707)

నా ప్రేమ కరిగించె నామె
కర్కశ హృదిని మెల మెల్లగా
విరుల నుండి సెగల
త్తరుల తీయురీతి మెల మెల్లగా !

గుండె మంటల నార్పె విశ్వాసి
గుట్టుగా తాను నా ప్రేయసి
వేడి గాలిని గులాబీలు
వెళ్ల గొట్టిన రీతి మెల మెల్లగా !

వింత అనుభూతు లీను నే
కాంత రాత్రులాయుమతో
కొంత నే వినిపించ నిం
కొంత తననిపించ మెల మెల్లగా !

కాంతు లీనెడు మోము
కరిగించినది మదిని
కనకమును తేజాబు
కరిగించు నటుల మెల మెల్లగా !

తన కనులు నిండుగా నింపె
తగ హృదినెల్ల మైకము
మన స్పర్శ జ్ఞానమును
మధువు మత్తిడు రీతి మెల మెల్లగా !

తళతళల ఆమోము
దాపుకేతెంచుటది
హృది దోచు కొనునట్టి
ఉదయ భానుని రీతి మెల మెల్లగా !

చొచ్చినది గుండెలో
పిచ్చిగా తననిన ప్రేమ
కనులలో కాలిడెడి
కమనీయ కలలలా మెల మెల్లగా !

× × ×

కర్మలన్నిటి కన్న
ప్రేమయే కడు మిన్న
అన్ని ఐహికములు
ఆముష్మికముల కన్న !

ప్రతి పలుకు నీది మధురము
ప్రేయసీ నీ పిచ్చి ప్రేమికునికి
పలుకుమా నాతోడ నొకమాట
ఇతర ప్రేమికులంత ఈర్ష్య పడగ !

ఆత్మ కాహ్లాదాలు
ఆ నీ అధరాలు
దేవతా ఊపిరు
లా నీ అధరాలు !
అందాల దేవతలు
అమృతము తెచ్చి
పులిమి వెళ్లినారు పో
నీ అధరాలు మెచ్చి !

ప్రేమ రోగము
పొందె నెవ్వడు
మనశ్శాంతికి
దూరమాతడు
ప్రేమ శరములు
తగిలె నెవనికి
బ్రదుక దెందుకు
కాదు భారము
ప్రేమ ఒడిలో
పడిన వాడు
ప్రేమ లోనే
పాయునసువులు !

# సయ్యద్ అమ్జద్ హుస్సేన్ అమ్జద్ హైదరాబాదీ

(1878 - 1961)

నీ పాదధూళితో
నే పవిత్రుడ నౌదు
నీపాదముల లోన
నే స్వర్గమును జూతు !

నీ పాదముల నుండి
నే చెతులను తీయు
నీ పాదముల మీద
నేనొట్టుపెట్టెదను !

శిరసు నీపాదముల
చెంత నేనుంచెదను
కనుల నీ పాదముల
కడ నేను ఉంచెదను !

నా కొలకు నీ విటకు
నడచి వచ్చితి నేని
కనుల నీరును పెట్టి
కడిగెదను పాదములు !

బీద బిక్కి బికారిగా
నీ వద్దకు వచ్చినాను
తెచ్చినాను నేనేమని
తెలిసి నీవు అడుగకు !

నీ కారుణ్యాన్నే నేను
నిక్కముగా నమ్ముకొని
అన్నింటినీ వదిలి నీకై
అరుదెంచితి నీ దయకై !

× × ×

జీవి యెంత కాల ముండు
చావే చెప్ప గలుగు నండి
అదృష్టమే చెప్ప గలుగు
నాఖరు క్షణ మెప్పుడని !

ప్రతి ఊపిరి ప్రముఖంగా
ప్రవచించి నటుల తోచును
'పోతున్నాన్నేను వదిలి
వస్తానో రానో మరలి 'అని !

× × ×

నిందించకదృష్టాన్ని
అంతా భగవదీచ్ఛ
ఏమి జరిగినా నీకది
అంతా భగవదీచ్ఛ

ప్రతిదీ ప్రశ్నించకు
ఎందుకిదీ ఐందని
ప్రతి ఎందుకు ? అది కూడా
ప్రబలంగా భగవదీచ్ఛ !

× × ×

ప్రతి క్షణమూ మరణపు అచ్చుదాటటం నిజం
ప్రతి ఊపిరి కరిగించును క్రొవ్వత్తి జీవితం
ప్రతి ఉచ్ఛ్వాస నిశ్వాసంలో ప్రకటంగా తోచు
మెత్తని ఓ కత్తేదో గొంతు కోయు అనుభవం !

కేశము లల్లాడిన నాగులనే తలపించు
రోదము లాగించిన రుజాగీతి వినిపించు
అగ్గిపుల్ల అంత చిన్న దానిలా కనబడ్డా
ఒక్క సారి గీకితే భగ్గుమని చూపించు !

మేధ లేదదేని మెడనొప్పియే వాడు
బుద్ధి చెప్పుట వానికి పెట్టగోడు
మూర్ఖున కెంతగా ముద్దుగ నేర్పినా
బుద్ధి వంకర పోదు వృద్ధి లోనికి రాడు !

ప్రొద్దూ మాపూ పూజలు సలుపుతారు
హద్దూ పద్దూ లేని ఆర్భాటం చేస్తారు
వద్దన్నవి తింటారు వాసనలు వీడరు
మందు వాడుతువ్నా పథ్యం జోలికి పోరు !

నా మాట నా ఆలోచనల బానిస
స్వతంత్రుల మైనా బందీలం తెలుసా
ఎంతగానో యత్నించినా ప్రతిదీ
విధి తలచినదే మన విధియని తెలిసె !

యతనాలన్నీ పేరు ప్రతిష్ఠలకే
అందరూ శ్రమించేది అనుభవాలకే
ప్రతి వాడూ కోరేది పనికిరాని ప్రఖ్యాతి
మట్టి బొమ్మలివన్ని ఒట్టి ప్రదర్శనలకే !

బ్రదుకూ చావుల పోరాటం తరువాత
నిన్ను వెదికి వెదికి సమాధి శాంతి పొంది నంత
ముఖము చాటు వేతువేల ఇకనైనా నీవు
ఒంటరిగా రాత్రివేళ చేరుము నా చెంత !

రెండు హృదులు జతైతే మూడోది పుట్టుకొచ్చు
ప్రేమ అందం ఒడిలోనే హృదులు నిస్తరించు
కాంతి శాస్త్ర మందటులే కలుగు జీవితంలోను
తీగలు రెండు కలువగనే 'జీవకాంతి' ఉద్భవించు!

తూఫానున నా చేతులు
తూలుతున్న ఎత్తేశా
నా కోర్కెల నీవేగతి
నావయిదో ఓ-ఈశా !

నాకు స్పృహ లేనప్పుడు
నడయాడి తానొచ్చును
తా వచ్చిన నేనుండను
నే నుండగ తారాడు !

అవినీతిగ
ఆర్జిస్తూ
ఆగడ్డే
ఆరగిస్తూ
ఆనోటనె
అసహ్యంగ
ఆదేవుని
ఆరాధిస్తారు
పథ్యమేమి
చేయకుండ
మందు తినే
మాదిరిగా
ఎంతలేసి
గొంతులెత్తి
ఏడ్చినమా
సుంతయ్మైన
ఆదైవము
కరుణించేనా ?

# ఖ్వాజా మీర్ దర్ద్
(1720- 1784)

జగతి సుఖముల కోర
శాంతి నెట్టులనుభవించు
విషయ వాంఛల గోర
శాంతి ఏ విధి లభించు !

శాంతి సౌఖ్యము
దైవ సముఖము
నగును ప్రాప్తము
జన్మ వీడుము !

ఎవడు ఎవని వాడు ఏమనందును
స్వార్థపరులే అందరు చక్కగాను
ఏడ్చి నిశ్శబ్దాన కుమిలి ఏకాంతాన
ఈడ్చు చుంటిని బ్రదుకిలాగున నేను !

జడలల్లు దృశ్యమది
ఒడలెల్ల పులకించు
పరదాల మాటాడ
తెరసిగ్గు నీ కేల !

పుట్టిరెందరు జగమున పోదురంత
పోయి నోడెవ్వనిని చూడ తిరిగి రాగ !

అతనికై నా కనులు
వెతుకు నహో రాత్రాలు
ఎవరి నెవరును చూడ
రెరిగి యుండరు గూడ !

చచ్చినాక
నాతలాపున
వచ్చి నిలబడి
అనెను ప్రేయసి
'ఎదురు చూస్తు
ఉన్న ఎడల
ఎటుల తాను
చచ్చునిటుల ?'

ఎంతో కాలంగా నీవు
చింత లేక జీవించావు
ఇపుడే కాంతంగా కూర్చుని
ఏడ్పు నాశ్రయించి చావు !

ఎంత క్షాళన హృదిని చేయుము
సుంత మిగులును ప్రేమ గంధము
కామ చేష్టలు లేని దెచ్చట
కావు మనహో దివియు నరకము !

ఏమున్నది నా వద్ద
ఇద్దామన్నా నీకు
నీకు సమర్పణ చేసు
కొనుటయే మేల్నాకు !

అందాలకు అందమా
తొందరగా రావమ్మా
గుండె నాది ఒక్కటే
నీకు కుశల గూడమ్మా !

మరణింప చేస్తున్నవి
మగువా నీ కనులు
వాటిలోన కన్పిస్తున్నవి
మృత్యువు క్రీనీడలు !

మృత్యువు నీడ నా ముఖంపై
మోహరించి వున్నది
అద్దం చూపెట్టండీ
అంత్య కళ చూడాలనుంది !

ఒళ్ళు విరిచి నీవు జడ
లల్లు తుంటె చూడాలి
ఎవరు లేరు చుట్టూరా
నా అదృష్టం పండాలి !

# రఘుపతి సహాయ్ ఫిరాఖ్ గోరఖ్‌పూరి

(1892 - 1982)

అర్ధరాతిరి కొండిని గట్టెడు
ఆముదపు దీపమది చూడు
అంత నీరస మందె అగుపడు
గజలు పూర్తి చేసి కవివరుండు !

చేతిలో చెయ్యేసి చెంత ఉంటే నీవు
బాధ లేవియు నాకు గురుతు రాబోవు
అగ్నిశిఖ లెగసేటి కారడవి లోను
సుఖ శాంతు లిచ్చేటి సుందరివి నీవు !

చెడునడత లొదిలి పెట్టినా
మనిషి తాను దేవుడగునా
కవికిది ఒకటేనా కర్తవ్యం
గుండెలలో కారణ్యం గుప్పుటేనా ?

చిలికి విషమమృతము తీయు
పొసగ కోపము నుండి పూలు తీయు
తల్లి చిన్నారులను తాను తట్టు తీరు
ప్రియ సఖుని తాను ప్రేయసి నిలదీయు !

నీ మెత్తని ఒడిలో నిద్ర బుచ్చినావు
నిశ్శబ్దపు పిలుపుతో నిద్ర లేపినావు
నీ సేవలో తరించ నిమ్మో మాతృభూమి
నీ మట్టిలో కదా మమ్ము మలిచినావు !

మొగ్గ వీడనే లేదింక
యౌవనం – ఆమె వంక
జనుల దృష్టి తగిలిందా
జాగ్రత్తే గతి తన కింకా !

ఇతరుల కందరికీ
ఇమ్ము సఖీ మధువు
చక్కనమ్మ చాలును నాకు నీ
తిక్క రేపు చూపుల మధువు !

గాలి మొగ్గకు చక్కిలిగిలి పెట్టినట్లు
తంత్రులను వాద్యకారుడు మీటినట్లు
ఆమె చిందించు చిరునవ్వు అందాలు
ఆలయాన దీపకాంతు లలరినట్లు !

ఆత్మ చంపుకొనువారే
అంతా ఐనప్పటినుండి
అబద్ధాలే రాజ్య మేలుతూ
అవే నిజా లౌతున్నాయండి !

# షౌకతలీ ఖాన్ ఫానీ బదాయుని

(1879 - 1941)

వయసు తాను మరచి
మనసు నేను మరచి
రాతి రంత ఆడినాము
రతి క్రీడలు – మైమరచి !

పడతుల దు:ఖాలను వారినోటనే విను
వినదగినవి సుమా వెతలన్నీ వారివి
తీయు నెవడు గలడు తిక్క బుద్ధి ముల్లను
మంచి మొగుళ్లైతేనే అదృష్టాలు వారివి !

చెలి కోసం చింతించితి కొంత కాలము
చివరి ఘడియ వీక్షణలో చెదిరె నెంతో కాలము
తెలివి వచ్చి చూడ తెలిసె నంతా భ్రమయని
మైకం బాపతు మత్తు దిగుటలో గడిచెనే జీవితము!

మన ఆద్యంతాలలో మనకు లేదు ప్రమేయం
విధి శాసించినట్లు వెళ్ల దీయుటే జీవితం
ఒక్క ఊపిరైన లేదు ఒద్దికగా మన అధీనం
ఇంకా మనం స్వతంత్రులమా ఎంత దారుణం !

కొంత సేపు స్వర్గం మరి కొంతసేపు నరకం
ఇంతలోనె సంతసం ఇంతలోనె దుఃఖం
సుంత సేపె ఈ వెలుగు సుంత చూడ చీకటి
సూర్య కాంతి ఏ చోటా నిలువ దన్నదే సత్యం !

దీపం మలగ కుండ
దీనముగా కాలిపోవు
రాతిరి అంతమవదు
చక్రంలా తిరిగి పోవు
ఉఛ్వాసం నిశ్వాసంలో
లీలగా వినిపించు
గుండెను కత్తేదో
కోస్తున్న గట్టిదరువు !

గుండె కోత భరించగా
ఎందరినో చూచితిని
గుండె నెత్తురు స్రవించగా
గ్రోలుటనూ చూచితిని
ఇంతకు ముందెవరన్నా
చస్తేనే ఏడ్చే వారము
ఇపుడెవ డైనా బాగా
బ్రతికితే ఏడుస్తున్నాము !

# జగత్ మోహన్ లాల్ రావణ్

(1889 - 1934)

కీర్తి దాహం తీరేది కాదు
పేరు ప్రతిష్టల కోరిక పోదు
సమాధి రాతిపై నీ పేరది
చచ్చీ నీ ఆశ తెలుపక పోదు !

జీవితము నేమని వచించను
బాల్యమేమి యౌవన మేమనను
అది సుమ సుగంధం ఇది సుడిగాలి చందం
చిత్రంగా బ్రదుకన్నది చావుకౌను సమను !

సంవత్సరాది కదా తిక్కగా త్రాగండి
చషకమెలా చాలునీ సుదినం నాడు
ఆకసాన్ని తిరగేసి ఒలుకు దాక నింపండి
చుక్క మిగల కుండ సుబ్బరంగ త్రాగెదనండి !

బుద్ధి - విధేయుల చేయును
ఊహల రెక్కలు విరుచును
నాగరకత - కట్టిపడేయును
ప్రకృతి నుండి మనల వేరు చేయును !

ముసినగవున తారలతో నవె ఓనాడుదయం
'మీ మెరుపులు మీ కాంతులు ఇంతటితో చెల్లు'
తారలనెను వెంటనే 'మేమిటులే ఉంటాం'
నీవే కద వస్తూ పోతుంటావ్ నోరు మూసుకెళ్లు !

మనసు నిర్మల మైతే
మహర్షి వే మరి నీవు
గుండె విశాలమే యైతే
గురు ధనివే పో నీవు
చేయు లేవు మనిషి నేమి
చింతల ఈ శృంఖలాలు
ఆలోచన లదిరితేనే
అప్రతిష్ఠ పాలౌతావు !

సంతస క్షణాలు కొన్ని
నా ఒడిలో వడిగా పడెనా
గుండె బిగువు కాస్త సడలి
కొంత సేపు నిదానిస్తె
కాని ఏం లాభం ఎప్పుడూ
బాధలే బాధలు దొరికెనా
ప్రపంచం పైనే రోత
పుట్టె అంతా మిథ్యగా తోస్తె !

# మోమిన్ ఖాన్ మోమిన్

(1801 - 1852)

చుక్కకూడా త్రాగ వద్దను
సూక్తి పలికెను ఖుదా తాను
చుక్క ప్రేయసి తాను మాత్రము
చుక్క కూడా వదల వద్దను !

నా ఆశ భక్తి పై
నశియించి పోయినది
ప్రార్ధనలో యింక
బడయున దేముంది
ప్రేమలో ప్రేయసి
దయచూడ నపుడు
దేవుడు మాత్రమేం
తను చేయ గలడు !

ఏమి సౌఖ్యము నాకు
ప్రేమ ఈయనె లేదు
ప్రేమ మోస మందు
గుండె కాలి చచ్చె !
గుండె కన్నా ముందు
కాలి చస్తే నేను
నరక మీ రీతిగా నే
నను భవించ కుందు !

క్షణ క్షణమూ విసుగిపుడు
అడుగడుగున బహుమతులపుడు
అంత ప్రేమ ఎలా ఇంత విసుగాయె
ఆశ్చర్యం ఈ మార్పుకు హద్దే లెదాయె !

అందంగా కనబడడం
అందరికీ అవసరం
అందుకే ధరించడం
అందమైన దుస్తులు మనం
ఏమి కోటు ఏమి బూటు
ఏమేమి ఆ ఠాటు
ఒట్టి హంగు కాకపోతె
బట్టలోన ఏమున్నది
కట్టె అయే కాయానికి
బట్టలందమా ఏమి ?
హృదయమైనచో తెలుపు
ఉడుపు లన్నియూ దిగదుడుపు

ఇంటివద్ద మనశ్శాంతి
ఎంత మాత్రం లేదాయెను
ప్రేయసి వీధిలోన
ప్రేమా దొరుక దాయెను
పాదరసంలా యిలా
బ్రదుక శాంత మాయె
అవిశ్రాంత మది యెంత
అంత మొంద చేయును !

# మిర్జా సలావతలీ డాబిర్

(1803 - 1875)

ఇద్దరు బలవంతురు
ఎపుడు కలిసి వుండరు
కలుపు తాయా చేతులు
రెండు కంటి రెప్పలు !

ఎంత గొప్పదీ  మధుశాల
ఎంతలేసి ఐక్యమిచట
'మధువు వేయి చషకాల'
అనగానే పెదిమలు విడుట !

ఈ కౌగిలి ఏడ్పులలో
ఎదగ నిండు నను దయతో
ముళ్ల బాటలో నాకు
వెళ్లుటయే ఆనందం !

ప్రపంచమో వింత కార్యశాల
చూచితి మెందరు రారాజుల
ధరించి పట్టు పీతాంబరాల
సమాధిపై లేక షామియానాల !

జీవితాన్ని సోమరిగా
చెల్లి పోవ నీయకు
పవలు రేయి భాగ్యాలను
వ్యయ పరచకు వృధాగా !

అనుసంధించు అల్లాతో
ఆవహించె ముసలితనం
జీవిత మను దీపమును
మలుపు గాలి మొదలిడెను !

శ్రేష్టుల మవగానే
కాష్టాలకు పోవాలే
నీటి చుక్క ముత్యమవనె
చిప్పవీడి పోవాలే
కాయలు తము పండగానె
శాఖ వీడి పోవాలే
పరిపూర్ణత మహాశాపం
చేయు దూరమిల్లకు !

పరిహాసం ప్రమిద వెంట
ప్రతి క్షణమూ ఉంచుకొంట
గ ఎర్రుతో ప్రొద్దు ఏ క్షణాన
గ్రుంకునో తెలియకుంట !

# ఫైజ్ అహ్మద్ ఫైజ్
(1911- 1984)

తస్కరింతురు నీటి కాపరులు కొంత
మ్రింగి త్రేన్తురు మత ప్రవక్తలింకొంత
త్రాగు బోతుల మాభాగ మదియు నెంత
మధువు చషకము నిండుటే లేదు సుంత !

ఆకాశంపై ఉదయాన
గుప్పితివా ముఖ సౌందర్యం
సాయంత్రం సమయాన
విప్పితివా కబరీ భరం ?

కవిగారి జన్మదినం కదా తెండి మధు రసం
పేరూ, ప్రతిష్ఠ, సత్కారాలెన్నో బడిసె నిజం
ఒకే తప్పు పెద్దాయన ఒద్దికగా చేసినది
ఒక వాక్యం వ్రాయ లేదు చప్పట్లకు నోచినది !

చోటదేదియు దారిలో నచ్చదాయె
ప్రేమ వీధిని వీడ గతి ఉరిత్రాడదాయె !

నీ జ్ఞాపకాల్ తుడిచె
బ్రదుకు నా మది నుండి
నిత్యావసరాలిపుడు
నిండి యుండెను మదిని !

# త్రిలోక్ చంద్ మెహరూమ్

(1887 - 1965)

శాంతి లేదు కానలలో
లేనే లేదు భవంతులలో
స్వర్గం లోనూ కనబడదది
సరిగా వెతుకు గుండె లోతులలో !

వింత వింత రంగుల ప్రపంచం
బందీయే ప్రతి ఒకడిందు నిజం
అయినా ఆశ్చర్యం ప్రతి ఒకడంటాడు
'ఏముందని ఎందుకని జీవించడం' !

ముద్దూ మురిపాలలో మునిగి పోయె బాల్యం
కలలూ కవిత్వాలలో గడిచె కదా యౌవ్వనం
కాయ కష్టానికే మిగిలె పాపం వృద్ధాప్యం
హత విధీ కాదా యిది మేటి దౌర్భాగ్యం !

భాగ్యమిచ్చు సంతసం కొందరికి
భామ యిచ్చు నుల్లాసం కొందరికి
అంతా అటునిటు ఊగే వాళ్లే కాని
సౌఖ్యాలు ఉన్నంతలో సంతసించు వాళ్లే !

మనసు అద్దంపై మచ్చ పడనీయకు
కుత్సితు లైనా వాత్సల్యంతో క్షమించు
అందరికీ నీ వైతే న్యాయమే అందించు
ఆశించక ఏ న్యాయం నిన్ను నీవు రక్షించు !

అన్నీవదులుకున్నాను
ఆమె జ్ఞాపకాలు తప్ప
అస్తిత్వం లేకున్నా మానె
ఆమె గుర్తు లుండనిండు !

కర్మతో సిద్ధించును
జీవితం స్వర్గం నరకం
అంతెందుకు నాకైతే
కాంతీ కాంతలె కరువాయె !

చంపాలను కుంటే
సవ్యంగా చంపలేవా
మందహాస మేల చేసి
మరణింప చేసెదవు !

వలపు జీవనపు
వాహిక నేను
ప్రణయ గీతికకు
శర్షిక నేను !

# షేక్ మొహమ్మద్ ఇబ్రహీం జౌఖ్

(1788 - 1855)

దీపమా నీ బ్రదుకొక రాత్రి వరకె
చిర్నగవుతో గడుప నిట్టూర్పు సలుప !

బాధలను భరియింప వచ్చినామీ జగతి
ఏల వచ్చామేల పోతామేమి చెప్పగలము
ఏడ్చుకుంటూ వచ్చినా మీ జగతి లోనికి
ఏడిపిస్తూ ఇతరులను వెళ్లి పోతాము !

భగ్నప్రేమిక మాన్యులందరు
స్వర్గ మందున దూరిరేని
స్వర్గ వాసులు తాము ఎల్లరు
నరక వాసము కోరుకొందురు !

సృష్ట్యాది
ప్రేమికుణ్ణి
ప్రేమికుల
కొలమానాన్ని !

# లభుంతాం జోష్ మల్సియాని

(1884 - 1976)

గుండె గుండెలో స్వాభిమానమేలే
అన్నీ మదంతో లావెక్కిన తలలే
దేవునిపై ప్రేమ ఏ మనిషీ చూపడే
స్వార్థమన్ని రంగుల్లో వర్థిలుతున్నదిలే !

నా కార్య దీక్ష కన్నీ అడ్డంకులే
ఐనా విధి నిర్వహణ నాప లేవులే
లే, లేచి, నడుంకట్టు లే లే
ఆరంభ శూరత్వం అవనీయకులే !

మేఘము లేతెంచెను నీవూ రమ్మో సఖీ
మహాఫిలు నంతా పరవశింపు చంద్రముఖీ
మధుపానం యిక మీదట వద్దు మాకెవరికీ
మత్తెక్కిన నీ కనులే మా మధువిక సాఖీ !

అద్భుతాలు నీవి కొన్ని ఆలకించనీ
కళ్ళు తెరుచుకొనే కైపులందుకోనీ
మంచి వాణ్ణి త్రాగించుట మహా తప్పు సాఖీ
త్రాగిన వాణ్ణి కైపులోంచి లాగి చూపు మోహినీ !

# నరేష్ కుమార్ షాద్

(1927 - 1969)

జీవతపు చీకటులలో
చంద్రుడూ చుక్కలవలె
ప్రజల మేలి మాటలలో
మధువూ చషకాలవిలే !

సుకుమార హృదయానికి
చూచిన దెల్లా కళా ఖండం
మూత కనుల నన దేనికి
జీవిత మింకా ఆనంద మయం !

శోకమేల కలదో సంగీత మందు
నిట్టూర్పు లేలనో దరహాస మందు
అందమది చూడ నో దీప కాంతి
ప్రేమ నెత్తురు చమురుగా కాలునందు !

ధరణి స్వర్గము కన్న అందము
ఆకసము నెడనది నవ్వు చందము
చుక్కలును రేడును సిగ్గుతో కుమిలిరి
వెలుగులీన ధూళి కణములేమనందము ?

# షబీర్ హసన్ జోష్ మలిహాబాదీ

(1898 - 1982)

మరోజన్మ ఉందో లేదో
మనునో సుఖాలందు లేదో
గొంతు దాకా త్రాగండిచటే
గోస్తనీరసమట ఉందో లేదో !

అన్ని శిలల యందద్దాల మేడలు
అన్ని బీజములందు బృందావనాలు
అణగ ద్రొక్కిన ప్రతి ఇసుక కణము నందు
అగుపడును కరుణాళుని చుంబనాలు !

గుండె విలపించ నేల నలుపెక్కు ముఖము
ముల్లు గ్రుచ్చుకొన నేల ఏడ్తుము మనము
అతిగ హసియించ నశ్రువు లేల వెడలు
ఎందుకో ఏమొ మన మెరుగ లేము !

నిట్టూర్చి నంత నను
నిందింతు రెల్లరు
చంపేసినా వారు
చర్చించ రెవ్వరు !

# సర్ మొహమ్మద్ ఇక్బాల్

(1873 - 1938)

అప్సరసలకై మత గురువు తాను మరీ
అంతగా గ్రంథ సాంగుడై పోయె నైనను
అతని మోమును చూడ కనిపించు
లీలగా నొక అమాయక చక్రవర్తిని తాను !

మనసనేది ఎప్పటికి
మనెనేని ప్రకృతికి
ఇంకొక షేక్స్‌పియర్‌ను
ఇవ్వదు ఏ నాటికి !

శిలావిగ్రహాలలో
శివకేశవు లుంటారా
మాతృ భూమి మట్టిలో
కణ కణాన దేవుడే !

ప్రేమ దారులలోన
తోడెవ్వడును రాడు
కోర్కె ఒక్కటె వెంట
కూర్మి వచ్చెడు తోడు !

నిండు సభలో రహస్యమును
నేను బయట పెట్టినాను
అసభ్యతకు చింతిస్తూ
శిక్ష కోరు కొంటున్నాను !

ప్రతికి ప్రేమలోన
బట్ట కట్టిన దెవడు
చావాకొటె తప్పించు నీ
చెరసాల సంకెల విహీన !

ఒరలో కత్తదుండెనేని
ఊరికే ఝళిపిస్తావు
రెక్కలు నొప్పెట్టుగాని
ఒక్కడినీ చంపలేవు !

భాగ్యనగర మందానాడు
ప్రవేశించి నప్పటి నుండి
ప్రతి దృశ్యం ఇదివరకే
పరిచయమే ననిపిస్తుంది !

మాటలు రెండు చెప్పాలీ
మదినలరించేవి సుమా
దయా దాక్షిణ్యా లెరుగని
దైవోపహతుడ ననిపిస్తుంది !

## యూస్ యంగానా చంగీసి

(1884 - 1956)

స్వాతంత్ర్యం నాకూ అది
సంతోషాన్నిస్తుంది
కాని కాళ్లు సాచుటెలా
కప్పు దాటి తెలియకుంది !

యౌవన మధు మత్తత కందరాలకెక్కనీ
ఒక్క నిద్రలోకైనా ఒదిగి ఒదిగి వెళ్లనీ
కామపు మంటలన్ని ఖచ్చితంగా తీర్చుకో
కడుగు గంగలో నీ కాళ్లు చేతులనీ !

కనులలో కనులు కలిపి కలల పిచ్చి వాడెవడో
కాస్సేపు చూచుతివా కౌగిలికే నిన్ను లాగు !

పోట్లాడుట మాకెపుడూ
పొసగని పని రీతే
ఆయుధాలేం ధరిస్తాం
అవి లేనే లేవైతే !

వేచుట చచ్చుట కన్నా
వేయిరెట్లు బాగందురు
వేచుట లోనే నేను
వేసారితి బ్రదుకంతా !

# దాఘ దెహిల్వీ

మెరుపంటే నీ చిరునవ్వే
ప్రళయం నీ మేని విరుపే !

జీవితాంతము నచ్చజెప్పిన
జడుని బుద్ధది మారిపోదు
కరిగి మైనపు కాల్వ లాగున
పారునేమో రాయియైనా ?

అసలే పరదాలలో
ఆపై మరో పరదా
చూపు కసలు అందవు
అందకుండ ఉండవు
ఏమీ ఈ ఊగిసలాట
ఇదేమి మన సయ్యాట !

నీ నిస్పృహాయత నెరిగి యున్నను నేను
నిన్న రాతిరంత నిదురయే యెరుగను

ఒక చషకము అనుగ్రహాము
సఖి నా కిట కాలేదు
ఇక ఇచ్చట నిలవడము
నాకు గౌరవం కాబోదు !

ఆత్మ ఎవడిదో దాహంతో
మధుశాల విడిచింది
మధువు పాత్ర నుండి సఖీ
మాయమై పోతున్నది !

మధువు మజా రోజూ త్రాగే
మధు పాయిల నడగండి
ముక్కు మూసుకుని తిరిగే
మునుల కేమి తెలుస్తుందండి !

కన్నులలో కన్నులనే
కలుపలేక ఉన్నాను
మన గుండెలు రెండూ
పెన వేసేదెట్టులింక !

పరదా పేరిట నీవు
చిల్మన్‌లో దాగున్నావు
కనపడవూ నా కసలు
కనపడ కుండా పోవు !

అద్దాన్ని నీ తొడలపై
అలా పెట్టి చూసుకోకు
అవి రెండూ సున్నితాలే
అద్దంపై అద్దం పెట్టకు !

# అక్బర్ అలహాబాదీ

నిట్టూర్పు విడిచినను
నేరమేనా నేను
కొట్టి చంపినా తాను
పట్టించు కోరెవరు ?

ఉద్యోగాలడగొద్దని విద్యార్థులకు హితవులు
పరీక్ష గెలుపు ముద్రలు వేయనేల కాలేజీలు
ఖాళీల్లేవని ఆఫీసులు కట్టనేల బోర్డులు
తీరా ప్యాసయి వుద్యోగాలకు తిరిగితే కాళ్ళనొప్పులు !

పరదాలు లేని భామలను పరికించి
అక్బర్ జాత్యభిమానం గుండె కలచి
పరదాలేవని యడుగ సరదాగా వెంటనే
'మగ బుద్ధుల పైన కప్పి ఉంచినా' మనిరి !

ప్రేమలోన నేను పడ్డానని చెప్పగా
'నీ కొచ్చిన దొకటెగా' నవ్వి ఆమె అనెనుగా
త్రాగుతాను నేనని అందరికీ కన్నెర్ర
నేనేమి తింటానని ఏ ఒక్కడు అడుగడుగా ?

నిజంగా నీవు విడిచే
నిట్టూర్పెపుడైనా
నీకూ తెలుసు
నీ కనర్థం తెస్తుందని !

# అఖ్తర్ షెర్వానీ

ఒక నాటిదైతే ఏడుపు
ఓదార్చ వచ్చు నెలాగో
ప్రతి రోజూ వినే ఏడుపు
కేదీ లేదు ఆట విడుపు !

రెండు తీపి కన్నులలో
నిండు సిగ్గు నర్తించెను
రెండు విషపు గిన్నెలలో
గండు కోప మగుపించెను !

మధువు తెచ్చే మత్తు
మగువ అందాన్ని పోలదు
పూవెంతగ వికసించినా
పొలతి యౌవనం కానేరదు !

ఆశలనదిమి పెట్టి
కోర్కెలను కూర్చోబెట్టి
చిలిపి కనులు సెలవిస్తే
సంతసింతు ముద్దు పెట్టి !

ఒడిలో కైపులు రెండు
ఒదిగి ఉండె కద నేడు
ఎవరి నను చందురుడని
రెండే కదా రెండు !

# మీర్ బాబర లీ అనీస్

మనిషి నెంత ఉన్నతంగ
మలిచినాడు ఈశ్వరుడు
ఇంతగాను బడుగుజీవికి
ఎంత గొప్ప జన్మనిచ్చె
తెలివీ, బుద్ధిబలం
గ్రహణశక్తి, భక్తి, విశ్వాసం
కడుంగడు శక్తులిచ్చె
పిడికిడంత బూడిదకే !

మహాను భావులెందరు
మరణించ లేదందురు
ఆస్తులు, పిలల్లు, చుట్టాలు
అరిగి నారా వారి వెంట
వల్ల కాడు వరకె అంత
వెళ్లి తిరిగి వచ్చువారు
వారి వారి మంచి పనులు
వారి వెంట వెళ్లు నిధులు
వారిని కీర్తి శేషులు చేయు
వారి భూరి స్వధానాలు !

అంత సులువు కానే కాదు
అందంగా ఇల్లు నడప
బ్రదుకు బండలు చేయు
వారి పని అది కనుక !

# జిగర్ మురాదాబాదీ

రాజకీయ సమస్యలు
నాయకులకే పరిమితాలు
నా సందేశం సదా ప్రేమ
లేవు దానికే ఎల్లలు !

నీ ప్రణయ మేమిచ్చును
సవ్యమైన సమయ మందు
హింసలెన్నో పడితి నీ సన్ని
హితము లోనే కాక నేను !

అందానికి యౌవ్వనం
అతికినట్లు తానుంటే
ఆహా యేమని చెప్పాలి
అయెనేని ప్రేమ జత !

దేవుడా కాస్త నన్ను దయతో బ్రదికించు
పాడె వీడి పోవు వాడిని గమనించు
ఎంత చిన్న బోయి వున్నాడో వాడు
ఎంత బాధ నాకై పడుతున్నాడో వాడు !

| |
|---|
| చెడుదినాలు వెళ్లగనే చెప్పకుండా వచ్చితివే<br>మరణమా నన్నెంత మహితంగా దోచితివే ! |

# రియాజ్ ఖైరాబాది

గూడు కుప్ప కూలి నాంక
గ్రీష్మ మేమి వసంతమేమి
పుడకల ఆ గూడు లోన
పూడ్చ బడెను ప్రేమ జంట !

కలశ మేమి ఖర్మ
ఇల్లంతా మధువుతో
ఇంపుగా నింపినా
ఇంకా ఇంకా కావాలనిపించు !

నీ ఎంగిలి మధువును
నా కొసంగి నప్పుడు
నీ తీయని ముద్దును
దోచినట్లు తొచెడు !

కురులు నీవు దువ్వినా
లేదూ విర బోసినా
ప్రియులు వాటిపై నెలాగు
పిచ్చోళ్లే తెలుసునా ?

అరమోడ్చిన కన్నులే అంత అందమొలక బోస్తే
ఇక పూర్తిగ తెరిస్తే ఈ జగమే మునుగులే !

## యస్. యస్. భట్టీ

వేన వేల కోరికలు
పెన వేసుక పోతున్నవి
ప్రతి కోరిక నా ప్రాణం
బలి కోరుతు పోతున్నది !

బాధల కన్నీరు తుడవ
రుధిర హృదయ మున్నది
రమ్యంగా ఓదార్చగ రంగుల
ఉదయాస్త మయాలున్నవి !

## సాహిర్ లుధియాన్వీ

ఆశల బంధాలన్నిటిని
నేడు పూర్తిగా త్రెంచితిని
ఏనాడిపుడింకెవరితో
నాగోడైనా చెప్పనంటిని !

బాధ పడకు మిత్రమా
పశ్చాత్తాపమే వద్దు
నా అదృష్టమంతే సుమా
నాకు బాధలే ముద్దు !

# షకీల్ బదాయునీ

కనులతోడ గ్రోలు చుంటి
కైపు నిచ్చు ప్రియ మధువును
శాపించగ గుండె వింటి
చషకము చేతి కందొద్దని !

మతాధీశా త్రాగవోయి
మరీ అంత భయమేలోయి
నీ అధీన మందు నరకం
నీదేగా స్వర్గమోయి !

నిద్ర ముంచు కొస్తున్నది
నేడపుడే నారాణికి
చేరందే నోటికి చషకం
పానశాల మూస్తున్నది

అందరదే పనిగ రచ్చ
ఆనందంపై జరప చర్చ
దుఃఖిలు మదితో నేను
దూరంగా కూర్చున్నాను !

# బిస్మిల్

అమర వీరత హృదయ మందున
అమరి పోరుకు సిద్ధ పడినాం
శత్రు సేనల కండ బలమది
చూడవలెనది ఎంత యున్నది ?

హిందూ దేశ జనులూ మీ పరిస్థితి
ఎందుకింతగా జాలిపడే దుస్థితి
మీ శవాలపై కప్పెడు గుడ్డ కూడ
మీరు దిగుమతి చేసుకోనే దుర్గతి !

విసిగి విసిగి వేసారాను
వెతల బతుకుతో నేను
కాలదన్ని ఈ జగాన్ని
కాటి కెళ్లు తున్నాను !

నా కౌఁగిటకే నాట్యమాడే
నాగినివీ నీ వేనా
నన్నే నన్నే వేటాడే
నాటి నా ప్రేయసివేనా ?

# ఖలందర్ బక్ష్ జుర్రత్

నా మిత్రుడొకతను
నాకిట్లు తను చెప్పెను
విందు కెళ్లిన రాత్రి
మిత్రు నింటికి నేను
ఘా మంత్రమో అది
ఏ మాయొ చేసినది
ఒప్పేసు కొచ్చితిని
ఒప్పుకో గూడనిది !

ప్రేమలోని మజా నేను
పొందనే లేదైనను
చిత్తము కోల్పోతిగదా
ఉత్తి పుణ్యమునకే నేను

మనసెవరి కోసమని
పారేసు కున్నానో
తనవైతె నేనెపుడు
కనకనే పోతిని !

ఇల్లే కాదు పేరు ఊరు
ఏకంగా మార్చేయండి
భూమే ఏమున్నది
ఆకాశం మార్చు కొండి !

## షాద్ ఆజమాబాదీ

నిశ్శబ్దం కన్నా బాధలు
నిజంగా దయనీయాలు
తల్లడిల్లుమో మనసా
కాస్త ఉపశనం వీలు !

మత్తు కనులతో ప్రేయసి
మరీ మరీ చూసి చూసి
మధు చషకము రాగానే
వెళ్లె తాను పరుగుతీసి !

## రాంయిష్ రాంపురి

నిషా మానమని ప్రేయసి
చషకం పగుల కట్టింది
తన కనుల నిషా రాక్షసి
తానేవిధి మాన్పుతుంది !

తాగ వద్దంటుందే
తాను నా ప్రేయసి
కలదామె చూపులందే
కైపు మధువూ కలసి !

# బహదూర్ షా జఫర్

గుండె మంటల నార్ప
గలుగకే కన్నీరు
ఇలలోన నాకిలా
తలవంపు తెచ్చినది !
నా ప్రేమ రగిలించు
నా గుండె మంటలకు
ఆ సముద్రము కూడ
ఆవిరై పోయెడిది !

నేను నిజంగా పిచ్చివాడిని
ఐనానో ప్రేమ పిపాసిని
చెప్పాలా కణకణలాడే
నిప్పు లింట్ల నివాసిని !

చచ్చినాంక సమాధిపై
దీపమెవడో పెట్టగా
పైటలనిట్టూర్పు గాడ్పులు
వడి వడిగా మలిపెగా !

కఠిన హృదయా ఒకసారి
క్షతమైన నా శవం చూడు
కనులెట్టుల నీకొరకై
కాయలు కాచి చూసెడు !

పారవశ్యము లోన
పడి ముద్దు పెట్టితిని
నా తప్పు కాదు చాన
నమ్మమని వేడితిని !

## ఆరజ్జా లఖ్నవీ

తడిసిన కురులను
జాడించిన దెవ్వరో
మేఘాలై కనిపించె
వర్షాలే అనిపించె !

చంద్రోదయ మెటులగునని
సఖిని నేను అడుగగా
కురులతో మోముకప్పి
కురులు విసిరి మోము చూపె !

బాధలు గతించినాంక
మంచి జరుగుననుకోకు
పశ్చాత్తాపం పొంది తీరాలి
ప్రార్థన లాభించు ననుకోకు !

ప్రొద్దటి ఎండలోన
పొడుగని పించిన నీడ
పొడుగే నీ పొడుగను కోకు
పొరపాటున నైన గూడ !

## ఇస్మాయిల్ మీరఠీ

మద్యమెంత త్రాగినా
మనకు రాదులే కైపు
కలువు సఖీ కాస్తైనా
మద్య మందు కనుల కైపు !

## అమీర్ మీనాంయీ

గుడిలో నైతే తీర్థం
కొద్ది సేపే కదా లభ్యం
అదే పానశాలలో నైతే
అహో రాత్రాలు సౌలభ్యం !
లేదా
మసీదులో కరుణ దొరుకు
మరీ కాస్త సేపే కద !
మధు శాలలో మధువు దొరుకు
నహో రాత్రాలు కద !

## ఖాజా అల్తాఫ్ హుస్సేన్ హాలీ

ఓ సంస్కర్తా సంస్కరించుట నీ జన్మహక్కు
బట్ట మీద మచ్చనేది ఉండు వరకు
మచ్చపోవు వరకె కాని మరీ మరీ ఉతకకు
మచ్చా బట్టా రెండూ మాయమయే వరకు !

గింజనోట పట్టి గోడ చీమ ఎక్కదొడగెను
తైమూరటు చూచె చీమ పదే పదే క్రిందపడ
చివరికి చీమ పైకి చేర తైమూరను కొనెను
'గట్టి నిశ్చయ మున్న వారికి కాదేదీ ఎత్తుగోడ'!

## అఫ్సర్

వాడిన పూదోటలనే
వసంతం చక్కబెట్టు
చెదిరిన మనసులనే
చేరును మహదానందం !

నే దోచిన నీ ముద్దును
నీవు తిరిగి తీసుకొమ్ము
పొమ్మేమన్నా నీది నేను
చోరీ చేశానా చెప్పి పొమ్ము !

## రంయాసుద్దీన్ రంయాస్

ఎవడి శాపమో ఇది
విధి పన్నిన కుట్రో ఇది
ఆనందాల దారులేవి
నా ఇంటిని చేరనివి !

## బద్రుద్దీన్ సబర్

మత్తు కనుల పరవశము
మన మేమని వర్ణింతము
మధువులోన మధువును
కలిపినట్టి అనుభవము !

## అమీర్ ఖుస్రో

నీవు లేని రాత్రులవి
నీకురులంత నిడివి
ఎంతకూ గడప లేనివి
నీ పొందులో రోజులవి
నీ పలుకులలా చిన్నవి
జీవితంలా బుద్బుదాలవి !

## నాసిఖ్

నిను బోలు ముఖమేది
కన లేదు వేరేది
నీ చిత్తరువట్టుకొని
జగమంతా వెదికినా కాని !

## దిల్ అయ్యూబి

మనిషి బ్రదక లేనప్పుడు
చావాలని తలుచు నెందుకో
జీవితమే కలైనప్పుడు
అది కూడా చెదురుటెందుకో ?

## సంయిద్ అంజూమ్

నీ ఆలోచనల రంగుల కలలలో
నేను తేలి పోతున్నప్పుడు
గ్రీష్మ మందు వాసంతం
గూర్చి నేను కలలు కందు !

## అరష్ మల్సియాని

వలపు కనుల నుండి
ఒలుకు కోర్కెలు దండి
కామ మావేశముల నాప
కలుగు నెట్టుల నండి !

## అలీ జవాద్ జైదీ

చందురుణ్ణి తాకి వస్తి
పూవులనూ పుణికి వస్తి
అంగనా మణులూ జోహారు
అన్నిటి కన్నా మీ తీరు !

## ఇస్మాయిల్ మంజూర్

రాళ్లట్టుకు రోడ్లపై
రౌడీలు తిరుగుతుంటే
అద్దాల నీ మేడకు
ఆహా రక్షణ ఏది ?

# హమీద్ హుస్సేన్ ఖాద్రీ

మత ప్రవక్త లెందరు మహిని వెలసిన గూడ
మగువ నీలావణ్యమె నిజ కిరీటార్ధము
ప్రకృతిలో పల్లవించు అందాల కందానివి
అర్థ శబ్దముల పూర్తివి రుబాయి చివరి స్ఫూర్తివి !

# అబ్దుల్ హమీద్ ఆదమ్

తప్ప త్రాగి తడ బడితే
తమాషాయే చూపరులకు
తడబడు తున్నట్టి వాణ్ని
తగును ఆదుకొనుట ఇరులకు !

# ఆతిష్

బీటలు బారిన నా హృదయపు
రేటు నడుగ లేదెవ్వడు
ఎటుల కొంటా రెవరైనా
చిటిలిన ఏ వస్తువునైనా ?

# ఆజమ్

మంచి దాని లాగే కని
పించు తున్న దైన గాని
దడ పుట్టిస్తున్నదామె
జడ పామో యేమోనని !

## కోకబ్ షాహ్ జహాన్వి

అదే ఆదే ఆ నీ ప్రేమ చూపు
అదే నన్ను దోషిగా నిలుపు !

## నాహిద్ బిల్కిస్

నీ యువ్వన సోయగాలు
నీ సొగసూ ఆహాొయలూ
ఒలికిన మధువు, విరియు పూవులో
కనిపించే అంద చందాలు !

## షమీం జయ్‌పురి

వెళ్లి పోతూ నీవు – నా నిదుర దోచావు
నిదుర లేదనినా – కలల లోనికి రావు !

## ముజ్తర్ ఖైరాబాదీ

విరబోసిన కురులలో
వెడలె చూడు ప్రళయం
చేతావని చేయకనే
చేరె దొడ్డ అపాయం !

## నిరంజన్ దాస్ ఘుబార్ (జమ్మూకవి)

అమర వీరుల సమాధులపై
అమరు జాతర లింకపై
జాతి వీరుల జ్ఞాపకాలకు
ఇవె నివాళులు ఇంకపై !

## సయ్యద్ షహీదీ

పెదవులపై చిర్నగవు కన్నులలో అశ్రువులు
బాధల భ్రమలింకా భయపెట్టే నిజాలు

ఎంతో నీతో నేనేకరువు పెట్టాలి
సమయ మెంతో లేదు సత్వరమే రావాలి

పిడుగు నుండి పూదోటను కాపాడగ
బడుగు గూడు నాదే గతి కావాలిక

చిర్నగవునే నేను చిందించగ చూచావు
గోప్యాలైన గుండె లావాలనేం చూచావు

తుడువ గలడాతడొక్కడే నా కన్నీరును
ఎవని దుఃఖము నా కన్నా ఎక్కువగును

చెప్పాల్సినదామేతో చెప్పనేలేక పోతిని
ఈ విషయం 'కవిగారూ' ఎంతో బాధ పడితిని !

# షానవ్లఖ్ హాఖీ

గడచిన యౌవనపు జ్ఞాపకాలు మదిని ముంచె
బ్రదుకు భవ్యకథలన్నీ కన్నులెదుట కనిపించె !

సుందర నందన దృశ్యాలు సొంపు సొగసు లాస్యాలు
తారా మణులను తలపోసే తాదాత్మ్యాలు ముందు నిలిచె !

మరిచిన ప్రేమ కలాపాలు మళ్లీ మదిలో మెదిలె
తుళ్లింపుల ఆ రోజులు త్రుటి లోపల గురుతొచ్చె !

కామ కేళి కార్య లీల పతంగాలే ఐన వేళ
ప్రపంచాన్నే మైమఱచి పై కెగురు తున్నటు లనిపించె !

కొందరు స్నేహితులైనవారి కొంటె మాటలు తుంటరి చేతలు
ఈర్ష్యాభర శత్రు దృష్టులు అన్నీ అపుడు బాగనిపించె !

బేడీ లెన్నెన్నో త్రెంచేసే వాడి వేడి ఆకారం
నోటికి తోచింది వదిరే నాటి ఆ దుడుకు తనం !

వెర్రి తనంలో విర్రవీగి విడి పోయిన వేళా విచిత్రం
కరుణామయి ఆ సరస్వతి కవిగారిని కనికరించె !

# మీనాకుమారి

ఆకాశం ఒంటరిదే నెల వంకా ఒంటరిదే
కలవని మనస్సుల గతి కూడా ఒంటరిదే !

నిట్టూర్చె మనసేమో దాగుండెను తారకలు
పొగమంచు కదులుతూ పోతున్నా ఒంటరిదే !

తోడులేని జీవితం తుదిదాకా వ్యర్థమయ్యె
దొరికినా సహచరుడు నడిచితిమే ఒంటరిగా !

ముక్కలైన రాళ్లవి ఎక్కడ కన్పించినా
గుండె బ్రద్దలన్నట్లే గోచరించె దారంతా !

తడసిన కురులతో దోబూచు లాడె నెవడు
చెడువాడని పించినను ఒడి తరింప చేశాడు !

పగలు గడిచె దీనంగా రాత్రి గడిచె హీనంగా
ప్రతి ఒకరికి దొరికేది ప్రాప్తి యందు ఉందేగా !

మనసు నర్థం చేసుకుందా మను మరీ మరీ నా ప్రయత్నాలను
వెక్కిరించి నవ్వటమే గాక వివరించిరి నాకు చావే గతని !

ఏదేమైనా హృదయం
ఎప్పుడూ ఏకాకి నిజం
దొరకిన ఒక్క స్నేహితుడూ
దూరమైన నా వైనం !

# అఫ్సర్ నిర్మలీ

దురదృష్టం వెంటపడి దోబూచాట ఆడుతున్నా
కఠినమైన కష్టాలైనా కలిగించు నానందం !

పాపం, నేరాల వైపు ప్రసరించేనా దృష్టి
గుండె విలవిల లాడి సిగ్గుచే కుంచించు !

ఎవరి మాట నమ్మాలో ఏమో తెలియని స్థితి
పూల మధ్యనే ఎన్నో ముళ్లున్న పరిస్థితి !

మనసులనసలే నొప్పించకు మహా పాప మది చూడు
మంచి మనసులో దేవుడు మానవుడై తానుంటాడు !

# ఖుర్షీద్ అహ్మద్ జానీ మరహ్రాం

దూరాకాశంలో చుక్కలంతగా మెరుస్తుంట
నేనీ లోకంలో కన్నీరే కద పారిస్తుంట !

నష్ట జాతకమేనా నా కథింతేనా
నాకీ జీవిత మంతా నవ్వే లేదా ముఖాన !

అన్ని అందాల కన్న ఆత్మా నందం మిన్న
నశ్వరా లందాలన్ని శ్వరము లేని దాత్మేనన్న !

# సలాహుద్దీన్ నయ్యర్

మరణం నీడలో ఉన్నా పరమేశ్వరుని జాడ వుంది
కాళ్లల్లో బేడీలున్నా కరాళ నృత్యం సాగుతోంది !

జోరుగ చైతన్యాన్ని కోరు వారె అందరూ
పారంపర్యం సంగతి పట్టించుకోరే ఎవరూ !

ఇటు రెప రెప లాడే దీపం అటు ప్రాణంతో పోరే శలభం
ఎవరికి భారం కాగలదో చివరికీ రాత్రి చెప్పలేం !

మనసు విప్పి మాట్లాడ డెవడు మరిదెక్కడి మానవత్వం
మాన వీయ విలువలనీ నాడు మట్టు బెట్టుటయే కడు హేయం !

రెప్ప కాలంలో రాలేదు స్వరాజ్యం కాళ్లెన్నో ఐనాయి ముళ్ల మయం
మహనీయుల నెందరినో మనం దానికై కోల్పోయాం ?

మలయ మారుతంతో మహీపతి కొప్పంద మేమో ?
ప్రజల కళ్లలో దుఃఖంతో ప్రబలె నశ్రువు లందుకేనేమో ?

అంతా నీ బిడ్డలే అయినావారిపై నీ చూపు వేర్వేరయెనా
ఇకనీ గొప్పతనం యేమిటి నీకూ మాకూ తేడా లేదనా ?

మిత్రుల చూపులలో శత్రుత్వం కనబడెనా
అంతటి దౌర్భాగ్యం సుంత వేరొక టుండేనా ?



కాలి బొబ్బలకు జడిసి ఏల ప్రయాణ మాపడం
కడప దాక చేరాకకాదిక నట్టిల్లు దూరం !

చూడాలి సృష్టిలో సోబతు నాకెవరు
ఎవరూ లేకున్న నా యిల్లెవరు చూస్తారు !

ఇన్నాళ్ల తరువాత ఏతెంచి నారెవరు
ఎవరైన చెప్పండి కారుణ్య మూర్తెవరు ?

ఎవరి కోసమిచ్చోట ఏర్లు పారుచు నుండె
ఎంత నీరున్ననూ సుంత తడువదె నోరు !

కన పడరె నా కెవరు కను చూపు లందు
కరుణాళు కాంతులను కన నెవరు చేసెదరు !

మన వారు కారెవరు అను వారె అందరును
మరి యింట దీపాలు వెలిగించు వారెవరు ?

బాంధవ్యముల మాట మా మధ్య కొచ్చినది
వారసత్వ సుమాలెవరు వాకిటన్నిలిపెదరు ?

కాలమేం చేసినదో
కదా తాను ఈ ఏడాది
వాసంతం మేలి ముసుగు
వహ్వాలాగేసినది !

## మీర్ లాయఖ్ అలీఖాన్ షాయర్

మందహాస మంటె నేను మరణానికైనా సిద్ధం
పరమ విధేయుణ్ణే నేను ప్రతి పనికీ సంసిద్ధం !

పీకల దాకా అన్నీ పీడలనే సహించాను
బట్ట లేసుకొని ఉన్నా మెట్టగోచీ సన్యాసినే !

అందని ఆ దరహాసం సుందరి మందహాసం
నా కనుల యందు నీరు నయగారా లైపారు !

పూలంటే పడి చస్తుంది ముల్లులా నను చూస్తుంది
నుదిటి మీద రేగిన చెదిరిన జుత్తే నేనన !

## అజీజ్ అసర్

పూలు వికసించినా నీవు రాలేదనా
పొదల నుండి రావేలా హృదినిండా సువాసనలు !

సుగంధాలు లేక నేను సమధుర కైతలెలా అల్లను
తోటంతా పూలే పూలు తోచె లేనట్లే సువాసనలు !

సువాసనల సుప్రియా నువు నా ద్వారం తట్టు
సుగంధమే సుగంధం ఒట్టు నా యింటి చుట్టు !

పుణ్యం పాపం చూడ కుండా పూలు తెంపే వారే అంతా
ఎవడిక్కావాలి సువాసనలు ఎల్లరూ వాస్నలకే దాసులు !

## మహర్ హైద్రాబాదీ

ప్రతి క్షణమూ ప్రళయమే బాధ నెలా వర్ణించడం
ప్రేయసితో ప్రేమాయణమే బాధ లన్నిటికీ మూలం !

పెదవి విప్ప కుండడమే హృదయం చేస్తున్న నేరం
ప్రేయసి కందరి ప్రోత్సాహమే పిచ్చి పొగరు కారణం !

పగిలి గుండె రోదించడమే ప్రాప్తి నాకుందని తోచడం
ప్రయత్నాలు విఫల మవడమే ప్రతిసారీ నేనిలా రోదించడం !

పట్టణంలో అందకత్తెననే కదా దిట్ట కవితలా ఎగసి పడటం
గట్టిగ ఓ దశాబ్దమే కదాఇట్టె నిలుచునది అందం !

## డాక్టర్ యూసుఫ్ ఆజ్మీ

సుందర సూర్యోదయాలఅందమైన వారసులం
తెరచుకొన్న గాయాల విరుస్తున్న గులాబీలం !

మెదలాలి మన మనసుల సృష్ట్యాది సౌందర్యం
మన వలె మన ముఖాల్లో మార్తాండుని తేజం !

రుధిరంతో మన కలల రూపు దిద్దు కున్నాము
విరివిగ రాబోవు దినాల విప్లవ కారులం మనము !

ఎల్లప్పుడు ఎండా నీడలలా హెచ్చి తగ్గు తుంటాము
భూమాత గుండె లోన పొంచి వున్న మరీచికలం !

# అసర్ ఘూరీ

ఆతిధ్యాల ఆనందాలలో అంతగాను మునిగుంటి
ఆత్మ మాత్ర మింటిలో అలమటించు తుందను కుంటి !

ఆత్మ పక్షి ఎపుడూ నాతో అరుదెంచ లేదాయెను
అది యెక్కడ ఎగురుతుందో అసలు పతా లేదాయెను !

చీకటే చీకటి రాత్రులు చిత్రంగా నావై పోయె
వెలుగే నాడూ గూడ నా తలపుల దరి చేరదాయె !

సూర్యకాంతి తరులపైన సొక్కి నిదుర పోతోందా
ప్రకృతి యందు నల్దిసలప్రశాంతతే నిండుకుంది !

శాఖ వీడుటకు పూవులుససేమిరా ఇష్టపడవు
పీకనులిమి మూర్ఖ జనులు శోకము కలిగింతురు !

కలలద్దాల సౌధాలవి కనుల మార్చినా రాళ్లగ
ఒకరొకరే వీడ ఈ కవి ఉన్నాడోనాడు చుక్కై వెలుగ !

మొండి వాడు సుతరాము
మూరెడైనా కదలడు
జగడాల మారివాడు
సిగపట్లకై అగుసిద్ధము !

# అహ్మద్ సఫూద్ ఖాస్మి

ప్రియ వలపులచే తగిలిన పెడ దెబ్బలచే గాయ పడిన
నన్నోదార్చి పోవాలని నా నానా మిత్రుల తపన !

ప్రేమ యాత్ర దారులలో పెను తుఫాను లెదురయ్యేను
ప్రేమ లేని ప్రేయసితో పెద్ద చిక్కు లొచ్చిపడెను !

మనసేమో మరువనంటుంది తానేమో రానే రానంటుంది
ఎన్నిసార్లు మొరలెడినా చిన్నమెత్తు విన నంటుంది !

ప్రేమ ఇదో పెద్దజబ్బు ఎందు కొచ్చిన దీ గబ్బు
మఱచి పొండి 'కవిగారూ' మానవ సేవయే మీ డబ్బు !

# డాక్టర్ అఖీల్ హాష్మి

నేడో రేపో నెమ్మదిగా నీమాధుర్యం అందునుగా
అనే ఆశ మది నిండా ఉండి ఆపుతోంది ఈ జీవినిగా !

ప్రియూలా మాటలతో ప్రేమగా అడగడం
మాకిష్టం కాని నీవో మమ్ము లెక్క సేయువు !

వియోగ మధు ధారల విపరీతంగా త్రాగితినా
అయినా నా ఈ దాహం అసలే మాత్రం తీరితేనా ?

ఆకులు అల్లాడిన అదిరి బెదిరి చస్తాను
కలవరమే మది నిండా కైతలెలా అల్లుతాను !

అభయ మివ్వనే లేదు అంతగ రాత్రి గడిపినా
సంతస మివ్వనే లేదు క్షణ మాత్రం సేపైనా !

వచ్చే పోయే ఋతువులు తెచ్చు మార్పు బట్టలలో
అవసరం మేరకే బట్టలుఅవి తెచ్చే ఆ అవస్థలు !

నాకన్నా ఎక్కువగా తనను నేను ప్రేమిస్తే
ఏ క్షణము తాను నాకు ఎంతో ఒట్టు ఎదురొస్తే !

కృతజ్ఞతన్నా లేదేమి వెతలిన్ని నే పడుతున్నా
వెళ్లను తానెటకో తెల్ల ముఖం నాకొదిలి !

శ్మశాన నిశ్శబ్దం నీ సముఖాన తోస్తుంది
అదేల నీ కనుమానం అపనమ్మకం కల్గుతోంది !

ఈ రీతిగ ఇంకెంతని ఏడ్చి నేను వివరించాలని
ముక్కలైన ఈ హృదియే చక్కని నీ నివాసమని !

కోరికలను మనం తీరిస్తే యేంలాభం
ఒకటి తీర్చ గానే వేరొకటి పుట్టుట తథ్యం !

అద్దం ముందు నిలబడి అనుకుంటుంది సుందరి
'చూడాలీ ఈనాడెవడి సోకు మాడునో మరి !'

అతిథి రాత్రికే కదా అంధకారం సదా
ఎప్పుడాప గలుగు తెల్ల వారు వెలుగు !

# రషీద్ జలీలీ

ఆపదలను తప్పుకోలేక అల్లాడే దెన్ని నాళ్లు
కష్టాలను కౌగిలించుకు కాపాడే దెన్ని ఏళ్లు !

ఎన్నాళ్లని నా కొరకు కన్నుల కునుకు హరిస్తావు
ఆరోగ్యం పాడు చేసుకు అవతారం చాలిస్తావు !

పెదవులు కుట్లేసుకు తుదకు నోరు మూసాను
ఎన్నాళ్లని ఈ బండలకు విన్నవించు కుంటాను !

వచ్చేవారెవయినా వాకిట్లోనే ఆగుతారా
కిటికీ నుండి నీవిలా చీటికి మాటికి చూడాలా ?

కన్నీటి బాష్పాలిలా కారుచుండె నవ్వులలో
ఎన్నాళ్లని ఈ రీతిగ నన్ను నీవు వంచింతువు ?

చేతులు కాసినా కాయులు చిత్రమే రాళ్ళిసరడం ప్రజలు
సరేలే ఇంకెంత కాలం సహకరిస్తాయూ చేతులు ?

ఒక కొంపనె ఒద్దికగా ఉండదాయె 'కవిగారూ'
ఇక రెండవ ఇల్లు గూర్చి ఎలా మీరాలోచిస్తారు ?



నీ గురించి అతిగా నేనాలోచించి నపుడు
ఊరట కన్నా మిక్కిలిగా ఉక్క పోతగా తోచినపుడు

నిను పొందాలను మక్కువ ఎక్కువే ఉన్నా
పొందలేనేమోనని మదిలో ననిపించినపుడు

ప్రజల కళ్లలో పడిపోతానను బాధకన్నా
నీ కళ్లలోనే నేను నిలువాలనిపించి నపుడు

దుఃఖపు టెండలు మండి పోవు తరుణంలో
నీడైనా నీ కురులది చాలనిపించినపుడు

తుదముట్టించి నన్ను తుఫానేమి చేస్తుంది
ఒక్కగడ్డి పోచైనా చాలు ఒడ్డు చేర్చుననిపించినపుడు

ఇంకాయేం చేయగలదీ జగమిక నన్ను
నీవు మారిన తీరుతో నేను నీరసించి నపుడు

'కవిగారూ' కాదాయేమిటి మీదదృష్టం
కనినంతనె మీరామెకు కైతలు వినిపించినపుడు !

## మొహమ్మద్ రహీమొద్దీన్ నియాజ్
(కరీంనగర్)

జీవితమంతా యింకా ఎన్ని చిత్రాలను చూపిస్తావు
ఈ రీతిగ యింకా ఎన్ని సంద్రాలను ఈదిస్తావు ?

సవ్యంగా బ్రతుక మాకుసామగ్రు లవెన్నునవి
ఆ కరుణాళుడి నుండి మాకు అనుగ్రహాలెన్నున్నవి ?

మా మేళ్లను నీ వెపుడో మర్చిపోయి వుంటావు
మారిన నీ చూపులతో మమ్మిటేల బాధిస్తావు ?

నేనూ ఉన్నానొకడను నన్ను కూడ దయచూడు
ఎందరికో మెరుపు లాంటి మందస్మిత మిస్తివిచూడు ?

'కవిగారి' నెరుగుదురంతా కదా ఎన్నోనాళ్లనుండి
ఇంటికి పిలిపించుకు వింటుంటారు కవితలని ?

## లతీఫ్ - ఏ - యమ్ - సయ్యద్ సైఫ్

శరీరం మీది మురికి స్నానంతో వదులుతుంది
మనస్సు లోని మలినం పరులను బాధించి తీరుతుంది !

దుర్మార్గుడు తానను కొని దూర ముంచ జీవితాంతం
కరుణా మయుడని విని కానిస్తి చెలిమి సుఖాంతం !

మొదట మొదట ప్రేమ అదో ఆటలా కనిపించును.
కాస్త దూర మెళ్లితిమా కఠిన పరీక్షగా తోచును !

అడుగడుగున కుట్రలే అగుపడుతూ ఉన్నవే
చిన్న ఏమరు పాటైనా చితికి దారి తీసేవే !

నీటిలోన మునుగు మంటలలో కాలు
ప్రేమికుడ వవకు పై రెండేలే మేలు !

విసిగి విసిగి వేసారాను వెతల బతుకుతో నేను
కాలదన్ని ఈ జగాన్ని కాటి కెళ్ళుతున్నాను !

# రయీస్ అఖ్తర్

నా ప్రేమకు నాణ్యమైన నజరానా కావాలి
చేయని తప్పుకు నాకు శిక్ష ఒకటి కావాలి !

వెతల మయం ఈ వెర్రి జీవితం నిజం
ప్రతివాడూ ఐనా ఈ బ్రతుకెందుకు కోరాలి !

చుట్టూరా ఈ గోడలు కొట్టి పార వేయండి
ఉల్లాసపు ఊపిరులకు పిల్ల గాలి కావాలి !

నా నిదురకు తగినట్టే నాణ్యత కావాలన్న
రాతిరంత కలలో పట్టే రమ్యంగా రావాలి !

చిన్న మాట కాదు చెలిమి మహా భావం
చేయాలంటే చెలిమి సామర్థ్యం ఉండాలి !

జీవిత మన్నదదో జటిలమైన పరీక్షేతే
అందం రోజూ కొత్తదో ఆపద తానెదురవాలి !



మౌనం విజ్ఞాపన మార్గం ఔనా కాదా ?
పెదవి విప్ప కుండానే ప్రశ్న సాధ్య మౌనా కాదా ?

జీవితాని కేర్పాటులు చేతినిండా కలవైనా
చావు గూర్చి ఆలోచన సాధ్యమదౌనా కాదా ?

మానవత్వ మీరీతిగ మంట గలసి పోతుంటే
అడుగడున దుష్ఫలితం అగుపించునౌనా కాదా ?

ఆలోచనలందుండీ అదృశ్యుడు సకల బలుడు
దర్శన మెన్నటి కైనా దొరకనిదే అవునా కాదా ?

మృత్యు వుందని తెలిసి ముందడు గేస్తున్నాం
మానవులం మనకిది మహాద్భుత మౌనా కాదా ?

జీవితాన్ని యేమేమని ప్రశ్నించ గలం మనం
జీవితమే మన కొరకో సవాలు తానౌనా కాదా ?

కాలానికి సరితూగే కవితలల్లు 'కవిగారి' ది
కమనీయం ఈ కవిత సమయోచిత మౌనా కాదా ?

నా ప్రేమపై ఆమెకు
నమ్మకం కలగలేదంటే
నా లోనే ఏదో లోపం
నమ్మికగా ఉందన్నట్లే !

ద్వారం నుండే తిరగ్గొట్టకు
నేరం చేసి విచారించకు
ఏకాంతంలో భయపడతావు
ఏడ్చి ఏడ్చి కుములుతావు !

## మోనిసె సయ్యద్ మోనా

స్వచ్ఛమైన ప్రేమయు సన్మిత్రత దొరికింది
నా దేశమందంతయూ నవ చైతన్యం దొరికింది !

విశ్వాసమె విశ్వాసం వీక్షించితి నెల్లరిలో
కనులు కలిపి నంతనే మనసు జాడ దొరికింది !

కొత్త వారె అందరునూ కొత్తవన్ని పరిసరాలు
అయినా అన్ని చోట్ల అవ్యక్తానందం దొరికింది !

పూదోటలవన్నియును పొంగి కౌగిలించు కొనెను
ప్రతి మొగ్గా కౌగిలిలో పరవశించి పువ్వయింది !

జన్మ భూమి చూసి నేను తన్మయుడనైన చందం
అందరి మధ్యా వున్నప్పుడు అవ్యక్తానందమె పొందింది !

కవిత పొరలి వస్తోందని కలం ద్వార తెలిపితే
సంద్ర మంత సిరా యైన చాలదనీ అనిపించింది !

పరదాకటు నువ్వు
పరదాకిటు నేను
పరదానే కాల్చేస్తే
పరదాయే మనకింక !

# హమీద్ అఫ్జల్

దారి రాయి నన్నంతగ దైన్యంగా బ్రదుకున్నది
తోకరాలు తినుటకీ ఆకారం లాగున్నది !

తప్పులేవి చేయునని తథ్యంగా తెలుసునాకు
తప్పుడు దగాకోర్లకు తడి బట్ట తీరు నాది !

మార్గదర్శక మిరులకు మరెలాగున చేస్తాను
గమ్యం నాకే దొరుకని గడ్డు పరిస్థితి నాది !

తుఫానేదన్నా ఐతే తొలగి పోవు నెలాగో
గాలి కల్లలాడే ఆ దీపానిది నా దుస్థితి !

పిడుగది నా యింటి పైన పడకుండా ఉండు గాక
అనుకునేంత పిరికి పంద పరిస్థితి కాదు నాది !

మిత్రులైనా శత్రువులైనా హృది కవాటమె తెరుస్తుంది
ఎంత ఎవరు సహృదయులో ఇంటి ద్వారం తెలుపుతుంది !

ఏడుపనేది వస్తే నాకు
ఏర్లు పారినట్లౌస్తుంది
మంచుకురిసే లాగనేను
కొంచెం కొంచెం ఏడ్వలేను !

## సాహబ్జాదా మీర్ బుర్హాన్ అలీఖాన్ కలీం

తుఫానేమి చేస్తుంది దృఢ నిశ్చయ శీలుల్ని
నిండు గుండె ఆతిథ్యం నడ్డ లేదు పేదరికం !

ఇంటిలోన సామగ్రులు ఎంత నిండుకొని ఉన్నా
చేత గాని తనమంతా చెల్లా చెదరౌతుంది !

ఎన్నో రీతుల వెలుగులు ఉన్నంతలో ఒదుగు చేసుకొన్న
స్వర్గ సీమ కాదా మరిల్లు శ్రీమతి పూర్తిగా తోడున్న !

## ఫెరోజ్ బుర్హాన్‌పురి ఖతర్

బాధలు నా వారి నుండి బాగుగనే లభిస్తుండి
నీ చెంతకు చేరేందుకు నిముసం తీరిక లేదండి !

చెడు సమయం కడు ఘోరం చెప్ప లేను దౌర్భాగ్యం
చెప్ప నేల నీ గుఱించి చివరకు పూజారీ అదృశ్యం !

నిందిస్తున్నావెందుకని నీ కితరు లంటేనే ప్రీతి అని
తెలియుదా నాకు మాత్రం తెలిసీ నిను చేరేదే రీతిని !

నాతో యేదో పని వుండేనా నాతో బాధల ఈ చెలిమండీ
దుర్భర వేదన మది నిండున్నా దొరకనిదే ప్రేయసి కన్నీరండీ !

## ఖుద్దూస్ నాజమ్ (రాయచూర్)

నీతో గడిపే సాయం నిక్కంగా గొప్ప సమయం
కన్నుల మధువది సాఖీ కడుంగడు పాననీయం !

ఒక చూపే అయినా చాలు సఖీ - తృప్తికి అంతే లేదు
నీ పేరు తలిస్తే చాలునే కోరే దింకేం లేదు !

వాసంతం మళ్లీ వచ్చె పూలన్నీ తుళ్లి పూచె
పంజరాన చిలకకు పలుకు లెన్నో తోచె !

కఠిన ప్రేమ మార్గాల్లో కదలాడాలింకా నీవు
పూలదార్ల వీధుల్లో పోతున్నదిపుడు నీవు !

'కవిగారి'ని ఊరంతా గౌరవింతు రయినా
సగటు మనిషికీ రీతి తెగ చెడ్డ పేరెందుకు !

## అమీరుద్దీన్ అంజుమ్ ఫారూఖీ

వింతగ నన్ను నీవు వీక్షిస్తావేలోయి
నేనూ నీలాగుననే నిక్కంగా మనిషినోయి !

ఎడ బాటు ఈ క్షణాల నేమని నే వర్ణింతును
చావంతటి దీలీల క్షణ క్షణం బాధించునోయి !

బాధల వాద్యపు రాగము బహుళంగా గంభీరము
రాగిణి రాగము రీతదిరక్షేదీ మునక తథ్యమోయి !

గమ్యం చేరందే మరి ఘాతుకంగా జీవితం తెర
దించేసిందున్న ఫళంగా మృత్యువొచ్చి తా మెరుపయి !

నీ హొయలూ అందాలూ నే చచ్చీ వదలని నిజాలు
నీ విచ్చు సరసాలు మరుజన్మకు కారణాలోయి !

## డాక్టర్ మంజూషా (నిర్మల్)

ఊపిరుల బందిఖానా లో ఉన్నాను నేను జీవిస్తూ
తనదైన తాకట్టులో తారాడుతు ఏడుస్తూ !

మట్టికాయమైనా దీన్ని పట్టుకు విడువకున్నాను
తోలు తిత్తి తుస్సను   నైనా ఉన్నాన్నేను వేలాడుతూ !

ఉద్రేకాల ఊపులలో ఉరకలు నేనేస్తున్నా
చిప్పిల్ల నివ్వలేదు చిన్న మెత్తు కన్నీరు !

మలయ మారుతాన్ని కల లాంటి అనుభవాన్ని
ఇచ్చపడే అందరికి స్వచ్ఛమైన స్వభావాన్ని !

దేవుని ఆరాధనలో దేబెరిస్తు ఉన్నప్పుడు
వింత వింత ఊహాలలో విహరిస్తుంటా నెప్పుడు !

అందం నిట్టూర్పులకు అలమటించి పోతుందట
అయినా ఎవని నిట్టూర్పులకు అంత బలం ఉంటుందట !

# మునీర్ హైద్రాబాదీ

ప్రేమలూ స్నేహాలూ పేరుకే - అన్నీ ప్రదర్శనలే
నాపై దయ చూపే నాథు డెవడు లేడసలే !

నమ్మ దగిన వాడెవడూ నాకింకా దొరకలే
మనసుకు నచ్చిన జోడు మంచి హృదిని కానలే !

వేటాడుతు శాంతిని వెళ్లనిదే చోటికిలే
శాంతటుంచి పావురంపు జాడ కూడ దొరకలే !

సేవలెన్నో నిస్వార్థంగ చేసిననూ చిత్రము లే
గౌరవించ గలయట్టి ఘనుడొక్కడు కనపడలే !

రహస్యాల నెన్నిటినో రట్టు చేయ తలచితిలే
'కవిగారి'ని మించినట్టి కమనీయుడు దొరకలే !



తారలలా ఆకాశంలో నేనూ విహరిస్తున్నా
ఆధారాలన్నియు నిరాధారాలవయ్యేను

రాతిరి అనంతరం రాత్రే మళ్లీ వచ్చింది
మా దినాలి కెన్నడూ మారవని తెలిసింది !

నాకన్నా కష్టాలున్న నాయుడొకడు లేడు
నీ కేమో కన్నీళ్లు నీ ఒడి నిండా ఉండు !

కనీళ్లేవిధాన ఇక కారడం మానేయను
కన్నీళ్లే సంతసాన కారుస్తా కద నేను !

నావ తుఫానులో నాది నడి సంద్రమందున్నది
తీరాలన్నియును కూడ దూరమౌతున్నట్లున్నది !

## మొహమ్మద్ మజర్ మొహియుద్దీన్

పూలు చేసెనా దరహాసం పొంగి పొర్లు నుత్సాహం
చివరి క్షణం అయెనర్థం సృష్టి దాని కర్త రహస్యం !

ఒండొరులేం మాట్లాడుకోరేంపెదవి విప్పడమేమన్నా నేరమా
కలముందీ సిరావుంది కాగితమ్మీద వ్రాయి వుత్తరం !

కోరి పడినదా ప్రేమలో క్రోధం లాగి పడేసెనా
ఎంత దూరమైతే ప్రేమలో అంతగ ఆకర్షణ పెరిగేనా ?

పుట్టిన నాటి నుండిన్ని గట్టిగనే అంటున్నారిది
కష్టాలది 'కవిగారి' ది ఇష్టమైన స్నేహమని అంతా !

క్షణ క్షణమూ పైట తాను జార్చు చున్నట్టనిపించె
అందం విందు చేయుటకే ఆలస్యంగా సర్దుననిపించె !

మేఘాల్లాంటి కురులనే మోహిస్తూ ఉండనా
పెదవుల అమృతాన్నే పీలుస్తూ నిలువనా !

## జామీ వజూదీ

చెల్లని నాణాలే నేడెక్కువ చలామణీ లో నున్నవి
చిక్కనిదే శాంతి ఇక్కడ చింతలు లోటే లేనివి !

దు:ఖిలు నపుడే వెన్నెల దొంతరలే కనిపిస్తవి
భాగ్య నగర మందే ఎన్నో బీద అరుపు లినిపిస్తవి !

## మొయిన్ ఫయ్యాజీ

హొయలు నీవి చూడ గుండె లయ తప్పి కొట్టు చుండె
ప్రతి నీ నిర్లక్ష్యము మా ప్రభుత్వాల్ని తలపిస్తుండె !

ప్రకృతి లోని రంగులన్ని ప్రబలంగా నీవనిపించె
తల నుండి కాలివరకు వెలుగే వెలుగని పించె !

ముళ్ళా , రెల్లు వాసనల ముగ్దల నేల చేశాడు
పూలూ పూతోటల బోలు పొలతుల నేం చేశాడు !

కైతలల్లు ఈ కలమాగేనా చైతన్యం సంస్కరణ మానేనా
ఆగేదే అయి వుంటే ఇంత ఆర్భాటంగా ఇది సాగేనా ?

అందాల ముఖాల హాయి ఆలోచించి చేసుకో
కొవ్వునులా కరిగిస్తాయి కొరకొర చూపులు చూసుకో !

# సర్వర్ హాష్మి

దుఃఖము లోలోపల శరీరాన్ని డొల్ల డొల్లగా తొలుచుట బాగనిపించె
అతిథే అతిథీ పతి ఇంటిని అమాంతంగా దోచుట బాధనిపించె !

ప్రేయసి జ్ఞాపకాలు మదిలో మేఘాలై ముసిరి నిండెనా
బోరుమనే వర్షంలో పిల్లనిలా మొత్తంగా తడియుట బాగనిపించె!

బాధలలో అనుభవించు మాధుర్యం ప్రేయసి పేరు లాగ తీపైనా
పుండేదైనా దండిదై మానక మొండిగా పొద్దు పుచ్చుట బాగనిపించె !

ప్రేయసి తానే కౌగిలలో వేటు కత్తితో వేసినదా
జీవితాన ఏ కీడైనా చిన్నదిగా తోచుట బాగనిపించె !

గుండెలోని గాయాలన్నీగుత్తులుగా విరబూసినా
పూలేయ్యై నా యింటిచుట్టు ముద్దుగా పూచుట బాగనిపించె !

మూగల్లా అద్దాల మేడల్లో ప్రజలు మొత్తుకున్నా బయటివారు విన లేరు
కాంతి వేగంతో 'కవిగారి' కవితలు గగనం చేరుట బాగనిపించె !



సుదతి తెగ ప్రేమించెనా హృదయ మాహ్లాద భరితమగు
పెదవుల పూలు హసించెనా మధు మాసం విదితమగు !

గొప్ప కవి మహాశయులకోవ లోకి రాకున్నా నాకు
జగము గాయ పరచ మనసు దుఃఖ గేయ మొకటి దొరలు !

అదృష్టం తలుపు తట్టు ఆ దినమూ వస్తుంది
నోరు తెరువ కుండా నేను హోరుగ కవితల వినిపిస్తాను !

చిన్నారి దైనా ఆకు తాను చేరుస్తుంది హరితం ప్రకృతికి
మనం ప్రతి చిన్న దానికి ఆడిపోతుమదృష్టాన్ని !

మండుతున్న పరిస్థుతులు మొండివవీ 'కవిగారూ'
నిప్పురవ్వగా మారి నిలద్రొక్కుట నేర్చుకో !

## యూసఫ్ యుక్తా

కష్టాల కడలి బాపతు కథలే ఎందుకు విన్పిస్తావు
నవ్వే వారిని అదే పనిగా నువ్వెందుకు ఏడ్పిస్తావు !

యువజనాళి దారితప్పే అవకాశం అతిగా గల
పాతాలను మాత్రమేల పనికట్టుకు వల్లిస్తావు !

పూర్వీకుల పరంపరను వారి భూరి అనుభవాలను
వీధిన పెట్టి అమాంతం వేల మెందుకు వేయిస్తావు !

్క దారులందుననే మే మెపుడూ చరించాము
యింకా పరీక్షలను మాకెందుకు పెట్టిస్తావు !

సత్య సాధనెలాగు అసాధ్యమే ఐనప్పుడు
కవితలుగా దాన్ని గూర్చి గానమెందుకు చేయిస్తావు !

ప్రపంచ శాంతి లాంటి మాటలనే వల్లిస్తూ
పేదప్రజల గుడిసెలనేల ప్రీతి నిప్పుకు కానిస్తావు !

## డా. హుస్సేన్ అలీఖాన్ ఆజిజ్

నా సాయంత్రాలన్నీ నమ్ము ప్రేయసీ నీకోసం
ఒడ్డడానికైనా ప్రాణాన్ని అడ్డు చెప్ప నీకై నిజం !

ముగ్ధాము ల్లోకాల కన్నా ముద్దు సుమా నీ కనులు
అన్ని జగతి సంపదల కన్నమిన్న చూడు ఆ గనులు !

అందం నీది చూస్తూనే నిందలు వేస్తారీ జనం
నాకన్నా ఎక్కువనే నీకు శత్రువులు నిజం !

నీ పెదవుల మధుశాలలు నింపలేదు చషకాలు
మధు దాహం తోనే నేను మరణ మొందెదను కాబోలు !

ఎన్నెన్నో నీ అనుగ్రహాలు ఎలా తీర్తు నీ ఋణాలు
చక్కని ఈ సృష్ట్యంతం దాక జన్మిస్తే పునః పునరపి చాలు !

## అబ్దుల్లాహిద్ జాహిద్

ప్రేయసి వీధి నుండి హోరు గాలి వీస్తున్నది
బాధా జ్ఞాన మాగాలి తిరిగి గుర్తు చేస్తున్నది !

మోము నుండి పెను గాలి ముసుగును లాగి వేస్తున్నది
పల్లెల్లో పట్నం గాలి ప్రబలంగా వీస్తున్నది !

ఆవేదన ఉన్మాదం హెచ్చుచేసె సుడిగాలి
తన నెత్తిన దుమ్ముతానె పెనవేసు కొనెను గాలి !

చెట్టునుండి తెగిన ఆకు చేవ లేక పోయింది
ఎటు వీచిన గాని గాలి అటే పే తాను పోయింది !

మబ్బు నా పొలాల మీద మసలినట్లు తోచింది
ఇది చూసిన గాలి దాన్ని ఎగరేసుకు పోయింది !

## మొహసిన్ జల్గాంవీ

ప్రతి దానికి ఇక మీదట బాధ పడొద్దను కున్నా
ప్రేమెరుగని జీవాల్నిట ప్రేమించొద్దను కున్నా !

ఒదిలి వెళ్లి నన్ను తాను ఉవిదెంతో హసించినా
నేనైతే గుండె పగిలి నిశీధంతా ఏడుస్తున్నా !

తనకూ నా లాగే ఒక దర్పణ సౌధమదున్నా
ఒక్క రాయి విసిరి నేను ముక్కలు చేయు లేకున్నా !

ఏ రీతిని సహించగా ఇంక వీలు కల్గుతుంది
చేయి కలుప లేకుంటే శరీరాలు దగ్గరున్నా !

నా హృదయ ఘోషే వినని నా ప్రేమ నర్థం చేసుకోని
పాపైయ్యా పశ్చాత్తాప పడని ప్రమద ననాలి నేనేమని !

ప్రేమే నాభావం ప్రేమే నా ప్రాణం ప్రేమ తప్ప వేరెరుగని ఈ జీవం
పిట్టగూడు కట్టుకున్న నేం లాభం కట్టుకున్నదే పిడుగైన ఈ వైనం !

మీరంటే ఏహ్యపడే మీకు తోడు రాకుండే
పడతి దింక కవిగారూ మఱచి పొండి ప్రస్తావన !

# ఘోస ఖ్యావముఖ్యా

బ్రహ్మచారి స్వతంత్రాన్ని పంచిపెట్ట దెవ్వరికి
ఇరుల ప్రక్క కూర్చుని తానీగలు తోల దెప్పటికి !

తనను పణం పెట్టుకొని గెలుచు పందాలన్నిటిని
ఒకడే ఆటాడినపుడు ఓడే నతడే రీతిని ?

గుండె లోని గాయాలను గుప్తముగా ఉంచుతాడు
చీకూ చింతలలో చిరునవ్వే పంచుతాడు !

ప్రజలంతా వాణ్ణి చూసి పకా పకా నవ్వుతారు
అద్దం చూపి వారి నతడు అపహాస్యం పాల్చేస్తాడు !

ఎంతటిదో కదా బాధ ఈ దుస్థితికి తెచ్చినది
మాసిన గడ్డపు మోము రేగిన జుత్తు రికాము !

చుబుకం పై చిన్ని గడ్డాన్ని చేస్తే రెందుకెగతాళి
జుత్తు అంతగా ఆమె నెత్తినున్నా చేయరు గేళి !

నిజం చేదన్న మాట నీవు నమ్మ లేక పోవుట
తెలివెంత ఉంటేనేం తెలివి తక్కువే నన్న మాట !

దుఃఖితులను చూసి రాత్రి దూరాన్నుంచి ఏడుస్తుంది
అంతేకాక ఆకాశం మంచునెలా కురిపిస్తుంది !

## ఇష్తాక్ మలిక్

ఇపుడే కద ఎగరాలని ఈ పక్షుల ఉత్సుకత
ఇదేం న్యాయం వీటిని ఇలా వలతో పట్టివేత !

బాట ఒక్కటే కద ఉన్నది బందు మీరు చేస్తే ఇది
పోయే ఈ ఊపిరిని పోకుండా చేసే దేవిధి !

కారణ జన్మలమయితిమా కాలి ముద్ర లుండు సుమా
కాల గర్భ మందు చూడుకలియు సగటు మానవుడు !

ఈతి బాధలను గుఱించి ఎపుడు నీవు తలవకు
జన్మ ధన్యతను గుఱించి జాగ్రత్తను మరవకు !

సౌభాగ్యాలను ఈ దేశం సంతరించుకొనునింకేం
వసంతాలెన్ని వచ్చినా వాడుతోంది ఈ కుసుమం !

## అతీబ్ ఏజాజ్

తారా చంద్రులను తలవకు కోరికల నిరాశ పరచకు
చావును మాత్రం వద్దనకుజీవితాన్ని నిస్పృహ పాల్చేయకు !

తనకు మాలిన ధర్మం లేదు అనునదేమి బాగా లేదు
తన లాగే అందరూను అను దానికి మించింది లేదు !

'కవిగారూ' అహమది ఖచ్చితంగా దెబ్బ తిను
ఇతరులెదుట తల మీది ఏ మాత్రము వంచినను !

## మంజర్ నిర్మలీ ఆదిలాబాద్

బ్రదుకంటేనే రోదయని మంచిమాట నుడివినాడు
పేదరికాన చూడ మనిషిని విచార సాగరాన మునిగినాడు !

ద్రోహం తలవక స్నేహితుని దోపిడీని తట్టుకు నిలిచినాడు !
నలు వేపుల నెత్తుటేర్లు కని కలి కాలం మహాత్మ్య మని నాడు !

తనకు తానే సాటియని తగ పగతురనే ప్రేమిస్తున్నాడు !
'కవిగారు' తన అనుభూతుల్ని కమనీయంగా ఆవిష్కరిస్తున్నాడు !

## అబ్దుల్ రజాక్ షేఖ్ (హన్మకొండ)

గుండె గూడు నెంతగా అలంకరిస్తే మాత్రం
బండ లాంటి ప్రేయసి లభిస్తే లాభమేం ?

ప్రపంచంలోనే ఎవరికీ మేం భయపడక పోతే లాభమేం !
సుఖమన్నది మా ముఖాన సుతరాము రాతే లేదదేం ?

గుండె నిండ గాయాలెల్ల మందు చుండ లావాలా !
కవిత పొంగి పరవశాన కవిగారుంటే ఒరిగేదేం !



ప్రశాంతయామినిలో ప్రతి ఒకరికి యవ్వనమే
ప్రతి రేయీ ప్రశాంతమే ప్రతి యవ్వన హృదయానికి !

మనసు మందిరాన్ని మరీ మరీ అలంకరింతు
బాధల బుతువులన్ని మరల మరల రాపోజూతు !

ప్రపంచాని కేమన్నా భయపడతామామేం
కాలమూ స్థితులేమన్నా కావనా మా అధీనం !

సుఖుడొకడైతే దుఃఖుడింకొకడు
కధలీ రీతిగనే కాదా మరి అల్లబడు !

గుండెగా యాలన్నీ ఉండె పుండులుగనే
బండా యేం కవిగారు ఉండే సదానవ్వుతూనే !

అంతగ ఆవులించుతూ
ఆమెనన్ను అనుమానించె
ఆలింగన చేతకాని
అర్భకుడా వీడని !

నీ ఎదిరి చూపులో
నిర్జీవుణ్ణైనాను నేను
మరణంకై చూస్తున్నాను
మరదైతే నీ చెల్లెలో ?

## విఖార్ సిద్దిఖీ కొన్పూర్

రాతిరిలో ఆగితినా ఏకాంతం కాటేయును
నగరంలో సాగితినా భీభత్సం పోటేయును !

ఆలోచన మానితినా ఆరి పోవు గుండె కోత
వ్యాకులమే చెందితినా బాధలెన్నొ బాదేయును !

నన్నీ నా దుస్థితికి నా వారే చేర్చినారు
ఆగితినా అమాంతంగ క్రీనీడే మ్రింగేయును !

కలి కాలం మహిమేనా కాల వైరమా యేమిది
నన్నీ విధి మొగ్గలోనె నా మంచే త్రుంచేయును !

గుండెలలో మెండగు నా ప్రేమంతా ఇంకు చుండె
సమీపంగ వెళ్ళితినా స్వంత జనమె కాటేయును !

## మొహసిన లీ మొహసిన్
## (మహబూబ్ నగర్)

కంట కునుకు రాదదేల కాదా బాధ నాకిది
కలలో ప్రేయసి వచ్చేదేల కాదా మరీ బాధ ఆది !

సభలో ఆమె గుఱించి చర్చించనే వద్దు
రాయా యేంటి నా గురించి రానే రాదా మొద్దు !

ఆ యెత్తున ఆకసాన అంతగ విహరిస్తోందా
ఎండిన ఏ చెట్టు పైన ఉండ నెంచునా పిట్టేదైన !

## డా. సయ్యద్ జావేద్
## (నిజామాబాద్)

సుఖ శాంతులు  వాని కిచ్చి దుఃఖాలను నాకిత్తువ
ముళ్లను నా చేతికిచ్చి గులాబీలు వానికిత్తువ !

నోరు మూసుకొన్నావేం నుడువ వేమి నా ప్రశ్నకు
'అవును' 'కాదు' అనకుండా అచ్చముగా బదులు నివ్వు !

మరీ మరీ చెప్పిననూ మనసు వినదు నా హోరు
చంద మామ కావాలను చంటి వాని జిద్దుతీరు !

కర్మలు మంచివి నేనెన్నో నర్మముగా చేసినాను
ఫలితము నీవిస్తే ఉన్న ఫళముగా స్వీకరిస్తాను !

## డా. అలీ అహ్మద్ జలీలీ

నా బ్రదుకు దారులలో నానా కంటకాల నెవడు
పరచినా డైనా తాను తెరచె సంబంధ ద్వార మతడు !

అద్దంలో తాను నా ఆత్మాభిమానం చూపి
నా స్థానం ఎక్కడనో నాకెరింగించినాడు !

ఆలోచనల గడపలో అడుగిడగానే తాను
అంతరంగలోచనాల్లో  అగుపడు తాడు  వాడు !

ఊరేదో తెలియదాతని పేరేదో తెలియదైన
గుండె లోన మొత్తంగా దండి వెలుగు నింపుతాడు !

ఎవరి కోసమై నేను ఎన్నాళ్ళుగ వెదికానో
నాదగు అస్తికత్వాన్ని నాకు తాను తెలుపుతాడు !

తల మానికమై స్నేహానికి నిలవాలని అనుకుంటే
నెత్తుటి ఏరులలో నన్ను నిద్ర పుచ్చి వెళ్లినాడు !

వెలుగులు నాకు కావాలని వేడుకొంటి నే నతనిని
మంటలలో మాడ్చి నన్ను కంటకుడై నిల్చినాడు !



పట్టణ బీభత్సంలో భలే దిట్ట దృశ్యమొకటగుపించె
గట్టి తుపానుతో పోరి చిట్టి దివ్వె చివరంటా నిలిచె !

పెను తుఫాను వీచి వీచి చెట్ల ఆకులన్నీ రాలిచె
ఒక్క ఆకు మాత్రం కొమ్మ కొదిగుండుట బాగనిపించె !

తమ తమ నావల కాపాడగ తాము మునిగి యున్నటులనిపించె
నిలువెత్తు అలలతో ఆడ నిర్భయముగ నా మది నిశ్చయించె !

మంచు నీటితో ఆర్ద్రము మసక మసకగా అనిపించె
బండ కేసి కొట్టి దాన్ని బద్దలు చేయాలని పించె !

ముట్టుకొన్న మాత్రాననె మురికగు నీ మేనని పించె
చూపులతో తట్టి తడిమి చోద్యము చూడాలని పించె !

కాలం యొక్క ఇతిహాసం ఖచ్చితముగ వ్రాయాలనిపించె !
కలం నెత్తురులో ముంచి గిలుకుటే సబబనిపించె !



ఎచటికెళ్లి తానెప్పుడెలా తప్పి పోయినదో గజలు
ఎందరినీ తన చిరునామా ఇమ్మను చుండినదో గజలు

ఎవరెవరు తననెలా అవమానించి ఆనందించిరో
ఏ పేరిడాలి వారికని ఎంతగ యోచించనదో గజలు

కర్కశత్వమే ఎపుడూ తనతో కలిసి వచ్చెనంటూ
హతమయ్యీ బ్రదికేవుంది చూడుడదో గజలు

నవ్య రీతులెన్నో తన నైర్మల్యం తొలగించగ
దుష్ట బుద్ధులచే నెంతగ దోచబడినదో గజలు

మంచు పూల స్నానాలు మరింకేల దానికి
కాలపు మంటలలో కాలు చుండెనదో గజలు

ఏమి దారుణ సంఘటన ఎంతటిదీ దుర్ఘటన
సభ్యత నిదురించినా ఎలా సదా మేల్కొనినదో గజలు

రూపు రేఖలు మారితే మాత్రమేం ఈ నాటికి
మీర్, గాలిబులు మిన్నగ వ్రాసినదే అదో గజలు

తాజ్ మహల్ పాలరాళ్ల పై తళతళ మెరుస్తున్న
పున్నమి వెన్నెలతో చేసిన పూల గుచ్ఛమిదో గజలు

చిన్నమంత దెబ్బకే చిట్లి పోగలదు సుమా
అద్దపు పని తనాల అసలైన అందమిదో గజలు

'కవిగారి' ని వదిలి తాను ఎవరి పంచలను చేరేను
చివరి కాయున పాళీ నుండే చిత్రంగా వెడలెనిదో గజలు !

# డా. ఇష్తికార్ షకీల్

చందమామ మోమునుండి మబ్బువీడి పోచూచిందా
తడ బడుతునే గుండె వడి వడిగా కొట్టు కుంటుంది

పూర్వుల సమాధుల వద్దకి పోతుంటేనే దారిలో
భక్తి భావ ముట్టి పడుచు బాధ గుండె పొరలు నిండుతుంది !

నా ఓటమి పైన నన్ను నిందించడ మనవసరం
కొట్టు కొనుట గుండె వంతు కొట్టినా ఆగనంటుంది !

ఆదర్శాల దారులలో అనవరతం మసిలే వాడు
అసలే మరువ బడకుండా అందరి గుండెల్లో ఉండేది !

తాకినంత నే శరీరం షాకు కొట్టి నట్లుండును
కన్నులెదుట మెఱుపేదో మిన్నగ మెరిసి నట్లుండేది !

నీ స్నేహం నన్నెంతగ నిరాశ పరిచిందంటే
పెదవి చేరి పెద్ద ఏడ్పు పెకల లేక నిట్టూర్చింది !

కవితలు కవిగారివి
సమయజ్ఞములైనా
అవి కొన్నైనా ఆమెకై
అచ్చంగా రాసేవే !

# సయ్యద్ షరీబీ (దోహాఖతర్)

అడుగడుగున నాకిటవేల పరీక్షలే పరీక్షలు
ఆనందా కృతజ్ఞతలు కరుణించు కృపా కటాక్షాలు

నా గూడు తగుల బడినా నాకే బాధా లేదులే
నాణ్యంగా వినీలాకాశం నాకు కప్పె ఒప్పు చాలు !

బాధలతో ప్రళయంతో బాగా పోరుదుననే కదా
నా గమ్యస్థానం నా కింకా దురమౌతోందసలు !

పాపి నెంతగా నైనా నీ ప్రాప్తి పొందు ఆశతో నున్నా
నీ ధ్యానమె నీ గానమె నిరంతరం చేతు నీ పూజలు !

పాప భీతి కలవాళ్లు భయపడ రెవ్వరికీ ఎపుడూ
నిజం చెప్పి విరోధినీ నే నౌతా నందరికీ ముప్పాటల !

రెండే దుర్దశలు జీవితంలో
మెండుగ నేనెదుర్కొన్నవి
నీ కలయిక మొదటి దశ
నీవు నా దానివన్న పేరాశ !

## షకీల్ మంజర్ (ముషీరాబాద్)

ఇదేమి ఐక్య భారతం ఏ ఇద్దరికీ ఇట విరోధం
విషపు బుద్ధి రోత మనసు ప్రేమ సఖ్యతలు లేనే లేవేం !

స్వోత్కర్ష స్వలాభాలె ఒక్కొక్కరివీ నైజాలె
ఎవరేమిటో చెప్పాలా చూసుకోండి దర్పణాలె !

ఏమని నుడువ పరిస్థితి ఈ దేశం దుర్భర దుస్థితి
ఏడ్వడం బాధపడడం తప్ప ఇంకేమీ చేయులేని స్థితి !

## డి. అంబాజీ రావ్ షాద్

నిన్ను కూడా పరిశీలించాను దీపం హృదిని చేసి చూశాను
దూరాలెక్కువైనప్పుడల్లా దగ్గరగుటకు యత్నించాను !

స్నేహితులంతా దూరమైతే చేశాస్నేహం సకల బలునితో
ఎవరికి నా మొర వినిపించను నన్నింకేం నేనే పరీక్షించను !

ఉదయం వీక్షణ కన్నా ముందు సాయం సంధ్యా దీపాలు కందు
నవ్వించాలంటే నల్గురినీ 'కవిగారూ' నాణ్యంగా నవ్వాలీ ఏడ్వాలి మీరూ !

## అస్మత్ ముజఫ్ఫరీ వరంగల్

పెదవి విప్పక ముందే ప్రేయసి మాటలినిపిస్తున్నవి
కనులు చెప్పక ముందే ప్రేమ కథలు కనిపిస్తున్నవి

అగ్ని పర్వతాల ప్రజ్వలనాలందగ పడుతున్నవి
సూర్యోదయ రవళుల్లో సంధ్యారాగాల్వినిపిస్తున్నవి

ఆకసమంటే పర్వతాలు అందం కథలు చెబుతున్నవి
కనపడ వలసినవన్నీ వినపడి నట్లనిపిస్తున్నవి

నడకల ఆమె హొయలు చూడ నాట్యాలనిపిస్తున్నవి
కాయము నుండైతే 'కవిగారి' గజలులినిపిస్తున్నవి !

గుండె గాయపు వెలుగులే
మెండుగా నా జీవితం
ఆర్పనెంచి నీవే వాటిని
ఆత్మద్రోహం పాలు పడకు !

చాటుమాటుగా నన్ను నీ
చక్కని కౌగిలి చేర్చిన చోటు
ఎన్నో నాళ్లైనా గాని నాకు
ఎంతగ గుర్తుందో చూడు !

# ఇర్ఫాన్ పర్భనీ - పర్భనీ

మదిలోన స్నేహభావం హృదిలోన ప్రేమ తత్త్వం
పదిల పఱచుమో దేవా పరమ పూజ్య ప్రణుతిస్తాం !

జీవిత కాల మంతా నేను జేతను అపూర్వ రీతి గాను
నా కొఱకో ఆలయుం నజరానాగా నిర్మించ వలెను !

చికటిలో ఏ బాటసారితడబడకుండ ప్రతిసారి
తలపై అమర్చుండో దీపం వెలుగు లీను రహదారి !

అలవాటు ప్రకారం ప్రేమ నందఱికీ పంచు
అదే రీతి నాకు కాస్త అనురాగం దాచి ఉంచు !

మీ దారులలో 'కవిగారూ' పూలే పూలు పరుస్తాను
నా దారుల కిరువైపుల మీరు మీ గజల్ల నుంచ గోరుతాను !

నా ఎడబాటు దుఃఖంలో నీ
నవ్వే నయనాల నేడ్పించకు
ప్రతి ఘడియూ చస్తున్నా నేను
మారాజుగా బ్రతుకుతాను !

మోమంతా ముద్దు మరకలు
చెదిరిన ఆ నీ కురులు
రాతిరి నీవానందించిన
రేత స్సుఖాన్ని ఘోషిస్తాయి !

# సయ్యద్ అబ్దుల్ ఖాదర్

స్వార్థాన్నెంత అవసరమైనా ఊర్ధ్వ ముఖం పట్ట నీయకు
పరాభవాల నేదేమైనా పక్క యిల్లు కట్ట నీయకు !

అన్ని పూల రంగులలో ఆ ఎరుపు నా రుధిరం
పరీక్షిస్తానని పూలను బాధించ బోకు నేస్తం !

పరీక్షా సమయమొస్తే ప్రాణం విడువ సిద్ధంకా
బాధలితరుల కొస్తే పంచుకో బంధువులా !

పట్టలేనిదీ మనసు పగటి కలలు కననీలే
పచ్చని పూదోటలలో రెచ్చి పోయి తిరుగనీలే !

ఆశల నాకాశం దాటి అసలే వెళ్ల నీయకు
ఈ భూమి కొకే ఒకటి సఆకాశమని మరువకు !

ఆత్మ గౌరవం ఎల్లప్పుడుఅత్యంత ప్రియమైనది
ఆత్మార్పణకు సిద్ధం చూడు అమర వీరుల భూమి నాది !

అభిముఖంగా ముఖానికి
ఆమె దీపం పెట్టుకొని
పురుగెటు వేపు తాను
పోతుందో చూతామనె !

# మనోహర్ లాల్ బహార్

ఆ రూపము ఆ హొయలు ఆ ముఖ వర్చస్సూ వెరసి
అనుమానం లేనే లేదు పరదాలో నిదందాల రాశే !

హృది చేసే నేరాలకు కొదవేమిటి బ్రదరూ
ప్రేమ నేరం కానే కాదు శిక్ష కూడా లేనిదే తీరూ !

'అనురాగం సమస్యేంటి' అని అడిగిన ఆమెకు
'ఏమి జావాబిత్తు నేను' నిర్ణయించ లేదీ రోజుకు !

అడుగడుగున ఆపదలే అన్నీ ప్రళయాలే
అగునంతం అంతా అనే లాంటి సూచనలే !

కరుణాళుడు పాపాలను కడిగేయాలి
ఒక నూతన ఉత్తేజము కనిపించాలి !

కరుణామృత మెదజల్లుము కాస్తంత నాపై
మాటాడుము తీయగ మదిరయౌను అది నాకై !

స్వర్గ సుఖాలన్నీ సౌలభ్యం తామౌతాయి
'కవిగారి' జన్మ ధన్యతకు కారణమౌతాయి !

## డా. హదీ మంజూహ్

కోట్ల జీవన మార్గాలలో కొత్తదారి లభించింది
నిజ జీవిత యానంలో నేస్తమే లభించకుంది !

కను కొలుకుల్లోన నీరుకలకాలం కాపురముంది
మది స్మృతిలో జ్ఞాపకాలు లేదేనాడు మరిచింది !

తుషార వస్త్రాలను తొడుక్కొనెను పూలన్నీ
ఆకులపై ముత్యాలను అలదె మంచు తుంపరలిన్ని !

అనుభవంతోనే నాకు అర్థమయ్యేనీ విషయం
'అన్ని శాంతు లేదో రోజు అమరుతాయి ఇంట నిజం !'

## రఫాత్ సిద్ధిఖీ

ఆలోచిస్తే మాత్రం అంతా కలలా తోస్తుంది
నిన్నటి కథ కూడా నేడెంతో పాతదనిపిస్తుంది !

ప్రతిఒకడూ నేడు అతి స్వార్థ పరుడని పిస్తుంది
ఇది చూస్తే మనస్సు ఎక్కడో చివుక్కుమంటుంది !

తల్లి ఒడిలో నున్న పిల్లని పకపకల ప్రహసనం
హృదయమున్న అందటికీ హృద్యంగానే తోస్తుంది !

అన్నిటినీ గుఱించి ఉన్న నిజం తెలిసినదా
ప్రపంచమే 'కవిగారూ' పచ్చి తమాషా అన్పిస్తుంది !

# సాహిల్ అహ్మద్

అరచేతి వ్రాతలలో అన్నీ సంద్రపు తీరాలే
అంతే కాదు నివాసాలలో అన్నీ దట్టపుటడవులే !

ఆకలి కళ్లలో నుండి ఏకంగా తొంగి చూస్తున్నది
వీపు మీద రాళ్ల మోత విపరీతంగా రాసున్నది !

బ్రదుకు దారిలో వెలుగులు బితుకు బితుకు మంటున్నవి
ఇట్టి వెన్ని దృశ్యాలో ఇంకా ఇంకా చేత వ్రాసున్నవి !

పట్టణాన చూడబోతె వైరాలే పెరుగుతున్నవి
కత్తులతో సహోదరులకుత్తుకలే కోస్తున్నవి !

తీరానికి తెలియునిదా నీరు దాన్ని కోయు తీరు
'కవిగారికి' తెలియునిదా కరతలాన వ్రాత తీరు !

మాటలలో పెట్టి పెట్టి నా
బాటలలోనికి తెచ్చినాను
మరో నాల్గు రోజులలో
మరుని నయ్యి చూపుతాను !

## డా|| రాహీ (బి.వేం.యం.యస్.)

స్వంతం చేసుకోలేం ఎంతకూ మరువలేం
కొందరి జ్ఞాపకాలలో కుమిలి కుమిలి పోతాం !

కనులు మూసినా కనులు తెఱిచినా
కనబడేది వారేవారు కనులేమి చూసినా !

కలలోన చూసేవన్నీ కవితలుగా చెప్పగలమా
మహితమైన అందాలన్నీ మాటలుగా మలచ గలమా !

మనసులోని బాధలన్ని మరవ నేర్తుమా యేం
కొన్ని బాధలలాంటి వార్ని గుర్తుంచు కొనుట ఖాయం !

సంతసాల క్షణాలవి సదా జ్ఞప్తి యందుంటవి
బాధలు కలిగించునవే బాగా మరువ తగ్గవి !

గొప్పతనం ఎప్పుడూ కొలువుండు తర తరాలు
తప్పిద మదెప్పుడూ తనువును వేదించు ముల్లు !

అన్ని ఆత్రాలూ హడావిడీలూ చిన్ని పొట్టలు నింపుకొనుటకే
ఇతరుల గూర్చి ఆలోచనలు ఎవరూ చేయులేని దందులకే !

## యూషబ్ తమన్నా

రాజీ కుదుర్చుకోవాలంటే రాళ్ళ గుండె నెట్టుకోవాలి
ఇల్లు కట్టుకోవాలంటే గుమ్మమూ గోడలుండాలి !

ముద్రలేని ముడి మనది ముడి వీడక తప్పనిది
నాకైన పరాభవము నల్గురికీ చెప్పలేనిది !

విశ్వాసం లేని నిన్ను వెర్రి భ్రమలో చేర దీశాను
ఇటుకా నీరూ మన్నూ పటుత్వం తెలిసి కొన్నాను !

## ముజఫర్ ఇన్సా నాజ్

నిరాశ గూడు కట్టై నీ ఇంటే అనుకోకు
నిశ్చయం నీకు ఇట్టై నెమ్మి వెలుగు సోకు !

జీవితంతో నాకు చెలిమి చాలా పాతది
నా ప్రేమ దాని సోకు గడపల పాలైనది !

అయినా నా ప్రస్థానం ఆగలేదు సుమా
నాలక్ష్యం గమ్యం అన్నీ నీవేలేమ్మా !

ఎక్కడి కెళ్లినా నీవు ఆనందం కళ్ల కితువను
ఆశతోడనే నేను అడుగు ముందుకు వేస్తున్నా !

తనువు చాలించాలనే తపన కలుగ లేదింకా
ఎక్కడ వున్నావో నీవు కాకితో కబురుపంపు !

నిరాశను నేనే మాత్రం నాదరికి రానీయను
ఎపుడో నీవు మాత్రం నాదానివౌతావని మరువను !

భాగ్యము రాయికీ చూడు పట్టించ గలడు మానవుడు
మనసుపెట్టి చెక్కాడంటే మాధవుణ్ణే చూపగలడు !

# డా. షమ్మా పర్వీన్

ప్రేయసి ముచ్చట పెట్టుట కనివచ్చె
పూలవాన కురిసి నట్టులనిపించె !

చందమామ తోబాటు అందగత్తె తానొచ్చె
ఎంత మనోహరమైన రాత్రి ఏతెంచె నని పించె !

తాను నవ్వుతూ నన్నూ నవ్వించె
ఎంతలేసి మహా దానందం పంచె !

ఆహా బొత్తిగా ఆమె నన్నోడించె
ఐనా ఆమెతో పందెం గెల్చినట్లనిపించె !

ఆమె మాటలే ఆమె పాటలే
గుండె నిండుగా ఆమె నవ్వులే !

ముచ్చట దీపానిది వచ్చినప్పుడల్లా
కన్నీరిద్దరి కంటా కారెను వరదల్లా !

> మరణించే వరకు నా
> మొర వినక పోతివాయె
> శవ వస్త్రం కదిల్చి చూడు
> అవి మోమున కనపడు !

## డా. మసూద్ జాఫ్రీ ఆదిలాబాద్

ఎందరో ఎందుకో ఎప్పుడూ ఏడుస్తుంటారు
భూమిపై తారాచంద్రులలా మే మెపుడూ మెరుస్తుంటాము !

కవితలు నావన్నీ కామినికే సమర్పింతు
సమాధిపై గజల్లన్నీ చక్కదనంగా చెక్కింతు !

అంతగ ఆమెగూర్చి ఆలోచన లెందుకని
మనసు చెదుర తెలియదా మరణం దాపురించునని !

## మొహమ్మద్ యూసుఫుద్దీన్ యూసుఫ్

కొందరు తమ వారిని కొంచెమైనా ప్రేమించరు
నాదైతే పెర వారినే నిరసించలేని తీరు !

బాధలుమరచుటకై మధుశాలలో కూర్చొంటే
మధు చషకం దానంతట మనచేతికి వస్తుందా ?

మనసు పడి పురుగొస్తే మనసు లేని దీపమంది
'కాలేందుకే జడిస్తే కాడువాడు ప్రేమికుడు' !

నా స్నేహ హస్తాన్ని నమ్మననకు మిత్రమా
పూలజల్లు కూడా నేను పోయుగలను శత్రువుపై !

## రజాక్ అసర్ షాఃబాదీ (గుల్బర్గా)

ప్రియురాళ్ల కళ్లలో ప్రీతిగ కాపుర ముంటాను
మంచులాంటి చల్లనైన మగువలకై పడి చస్తాను

సమయాన్ని నెనసలే ససేమిరా తిరిగిరాను
ముందుకెళ్లి పోవడమే వెనుకంజ వేయలేను

ఆకాశంలో వుంటానని నాకోరకెతుకొద్దు మీరు
భూమాత మట్టి కణాల్లో నా మనుగడను చూస్తారు !

## రహ్మాన్ జామీ

దేవుడెరుగు నామెకు యేమయ్యిందో చివరకు
ఎందుకు లకించు కుందో నా వుత్తరం చదివి ఏడ్పుకు !

సత్యం పలకినందుకు సజా చూడు ఇది నీకు
అద్దమంటి  నీ మనసు బ్రద్దలైంది మరువకు !

జ్ఞానం అంతే నాకెపుడూ గమ్యస్థానం చూడు
అనవరతం సాగుతాను  ఆ దారే నే నెపుడూ !

కనులు బాగా మూసుకొని కడు చేదు నిజాల్ని త్రావితిని
నోరంతా చేదే నేటికీ నొచ్చె మనస్సు చచ్చె నిజమని !

నాకు దారి చూపే మత గురువు నడక తడబడె త్రాగి మధువు
మార్గ దర్శియే యిలా మార్గం మరిస్తే యిక పోదా యేం పరువు !

## సయ్యద్ అబ్దుల్ ఖాదిర్ షకీబ్

అందరి బాధలనూ నావే అనుకున్నాను
బాధల శస్త్రాలన్నీ నన్నే కదా వెదుకును !

గుండెను దీపం చేసి కుదుట పడితి రాత్రంతా
అందుకనేమో ఉదయంఅంత త్వరగ విచ్చేసెను !

సంధ్యలలో నే చేసే వందనాల వన్నీను
రమణీయంగా చూసే కమనీయ దృశ్యాలన్నీ !

## గులామ్ హుస్సేన్ బాబర్
## (హన్మకొండ)

రాళ్ళు రువ్వటం పట్నంలో వేళ్లాని పెరుగు తున్నది
అద్దాల షాపులన్నిటి కన్నా అతి బ్రద్దలయే వీలున్నది !

ఈర్ష్యా విద్వేషాలు ఈ రీతిగ విత్తినిచో
తీపిపళ్ల వృక్షాలు దేశమంత కాచు నెటులు !

గాయాల నుండి ముసురుగా వెలుగు వర్షం కురియుగా
అందం నా ఆలోచనలలో అంతగా ఇమిడి పోవునుగా !

# జగ్జీవన్ లాల్ ఆస్తానా సహర్

కాల జ్ఞాన మిది వేదాంతం కానే కాదు
ఎవడిల్లు పతా నేడు వాడికి తెలియుదు !

బీదా బిక్కి జనుల బాధలు తెలియ కున్న
ప్రపంచ జ్ఞానమెలా పట్టుబడ గలదు !

నా గాయాలన్నిటిని నాణ్యంగానే
ప్రదర్శన శాలలోన ప్రముఖంగా పెట్టి !

చూడండని కంఠశోష చొప్పించిననూ
చూడలేదు ఏ ఒకడూ మనసు పెట్టి !

నీ కంటి పాపలలో నిలువగా తెలిసెను
మధుశాలల వెందుకు మత్తు కనులవుంటేను ?

ప్రతి ఊపిరి ప్రబలంగా ప్రళయాన్నే తెలుపు
ఎప్పుడాగునీ శృంఖల పై వాడికె తెలియును !

సిరులెన్ని దొరలినా కడు దరిద్రుడే వాడు
తల్లి దీవెనన్న మహా సిరి కల్ల య్యైన వాడు !

రాతిరి అంత మైననూ ఉదయమే లేని
రాత్రులు ఎన్నెన్నో కదా నేను చూచితిని.

## ఆషోర్ కాజ్మీ

బహుళంగా ప్రేమలో బాధలే ఎదురాయె
నా అనంతరం ప్రేమలోనరుడెవడూ పడడాయె !

ఈశ్వరుడు ఇవ్వ నాకు ఏ శిక్షైనా సమ్మతమే
నా నిరంతర ఓపికకు నాకేమిచ్చినా స్వీకారమే !

## అక్బర్ హైద్రాబాదీ

మన ఇద్దరి మధ్య దారి మరో పెద్ద ఎడారి
ఇపుడు దూర మనుకొంటే ఏం ప్రయోజనం మరి !

శ్మశాన నిశ్శబ్దం నీదైనా చావేనాకనుభవమైనా
ఇద్దరి మధ్యనేదో గుస గుస ఎవడెందుకు పెడ్తున్నాడైనా !

ప్రేమ జ్యోతి చిన్నది కాగడాయె బాధలది
ఏది గెలుచు కొందునో చూడ వలసి ఉన్నది !

## సిద్దీఖీ షబ్నమ్

కనులు చూపిన దొకటి మనసు చెప్పిన దొకటి
తప్పు వాటిదైతే దానికి తగని శిక్ష నా కేమిటి ?

## మొహమ్మద్ ఖులీ ఖుతుబ్ షా
(1565-1611)

నీ అనుగ్రహమేలే జగతిలో అందాలు
నీ మత్తు తలపులే ప్రేమ పరవశ గనులు
అంద చందాలకే అధిదేవతవు నీవు
సఖి నీకు సరిరావు వేరెవరి అందాలు !

## రాషిద్ అజర్

ప్రేమ యనే రాబందునన్ను పెను ముక్కలు చేసింది
పాము లాంటి ప్రేయసి దాని పట్టు నుండి తప్పించు కొంది !

కాననాన్ని దావానలం కమ్మి వేసి కాల్చి నట్లు
బ్రహ్మ చారి బ్రదుకునా క్రమ్ముకొనును మంటలట్లు !

ఏ దిశ  ఎంతగ చూచినా ఎవడు తాను కానరాడో
ఉన్నాడు నీయందుననే హృదయం తఱచి చూసుకో !

## సాఖీ ఫారుఖీ

మట్టికి నాపై కోపమేమొ ప్రవాహాని కొదిలింది
సుడి గుండం తానేమోచుట్టి వేసి చంపింది !

నీడలాగ వెంటాడును పాడు జనం ఎందులకో
నీడను నమ్మొద్దను నిజం తెలియ దెందులకో !

ప్రేమ బంధమందు పెన వేసి ఉన్నప్పుడు
ప్రేతపు అధీనమందుమనో కాయము లుండు !

విడివడొద్దు ప్రేమికులు
వేలున్నా తమ బేధాలు
శత్రువు కైన పట్టొద్దీ
సారస్యపు వీడుకోళ్లు !

# ఖుమార్ బారా బంక్వీ

చింతలలో మునిగినప్పుడొక చెలికాడే అమ్మైనా దొరికింది
అన్నంతగ తోచక తప్పదు ఆ దేవుడేనా దర్శన మిచ్చింది !

మరణం వచ్చినప్పుడు నా మనస్సెంతగానో ఆనందించింది
ఆ నాడే నాడో తప్పిపోయిననా ఆప్త మిత్రుడే తెంచెననిపించింది !

త్రాగానని నేనొట్టేసిన తరువాత ధరిత్రి ఎంతో కాలం నిలిచింది
ఎటేపా పై నేను ప్రస్థానం చేసినాఅటేపే ఓ మధుశాల కన్పించింది !

ఈ నాటికి కదా ఇరువురి కనులు కనులతో కలిసింది
ఏనాడో తప్పిపోయెననుకొన్న ఆనాకం చిరునామా దొరికింది

ప్రేమ మార్గముల యందెప్పుడూ మేము ఒంటరిగానే ఐనా నడిచింది
అందగత్తెయగు మా ప్రియురాలి అడుగు ముద్రల వేగా మేం దర్శించింది !

కత్తిపోటు కెవడి గుండె
గాయమ్మైననూ నిజం
నా గుండే రోదించును
నమ్మండిది బాధల భాండం !

# కవిగారం

నమాజు ముస్లింకెంతో నాణ్యమైన నీమము
ఆన్ని నుదురు భూమాతకు అవుతాడు పవిత్రుడు !

ఇంకేం నీదీ నాదీ  ఇంకా ఏం నీ వారూ
అంతా బూటకం సుమా ఎవరూ నీతో నడువరు !

రేపేమగు నేనెరుగను మంచేయగు నేమైనను
నా తండ్రి సకలబలుడు నా గమ్యం చూపుతాడు !

ఏ ఆదర్శముతో నైతే ఎంచు కొంటినో నేను
అది చచ్చిన చావు చచ్చె అహో ఓడి పోతి నేను !

ఇంతగ దూరాలుండున్నిసుంత ఎరుగనైతిని
ఇంతి కూపి రుండియును ఎంతగ నే నొంటరిని !

ఒకరాతిరె భారమా ఎటుల నీకు దీపమా
గడిపినాను జీవితమే కష్టాల్లో తెలియుమా !

ఈ రాల్చేకన్నీరు ఈ ఊర్చే నిట్టూర్పు
ఎంతకాలమిలా నాకు లేనే లేదా ఓదార్పు !

చరిత్ర పుటలలో సరిక్రొత్త చేదు నిజం
రచ్చ గెలిచి వచ్చినా ఇంట ఓడి పోవడం !

ఎట్టి గడ్డు పరిస్థితి నైనా ఇట్టే తట్టుకో గలను నేను
ఎచట నేను కుర్చొని యున్నా అచటే కలం నడప గలను !

ప్రకృతిని అతిక్రమించి బ్రదుక గలిగేమా మనం
భూమి నీరు గాలి విడిచిసాము చేయ గలమా యేం !

శరీరాన్ని లోలోపల మరీ మరీ నా బాధలు
తొలచి వేయడం ఎంతో విలవిల్లాడించింది నన్ను !

అనుభవాలు కోకొల్లలుగ అఘోరిస్తున్నానే తప్ప
కవిగా నేనేదో గొప్పగ కవిత్వీకరిస్తున్నానని చెప్ప !

ఘడియలు గంటలుగా క్షణములు దినములుగా
అడుగు కదలక జీవితంఓడి ఓడి గడిచె నిజం !

కలల నగరులలో కలవెన్నో కోల్పోతున్నాం
కలలు మనం కనడమే కదా నష్ట కారణం !

ప్రమాదాని కందకుండ పరుగిడాలి అనిపించును
ప్రాణ మెపుడో చెప్పకుండ మనల వీడి తుర్రుమనును !

అందేట్లు మరణానంతరం చెందే ట్టు నా వారందరికీ
ఆస్తి పాస్తులన్నీ రాసినా అందేట్లు లేదే ఆ శుభం !

నా ఇంట్లో కనులన్నీ నాన్నే ప్రశ్నార్ధకాలే
కాలాంతం కళలన్నీ కన్పించెడు యదార్థాలే !

ఈ జన్మకు నాకు ఇదే గొప్ప వరం
స్నేహితులే లేకున్నా శత్రువు లేడన్న నిజం !

ఆకారమె తనదైనా అంటిముట్టబోడెవ్వడు
నీడదెంత  అదృష్టము నిందల కది దూరము !

ప్రేమ వున్న ప్రతిచోట కలహాలవి తప్పవు
ప్రేయసి నేల ఓ చోట కలసి  మనసు విప్పవు !

ప్రతి ఉదయం ఎవ్వరితో అతి సుందర మౌతుందో
దిన మంతా ఎవ్వరితో ఘన సంపద ఔతుందో
సాయంత్రం ఎవ్వరితో సరాగ మౌతుందో
రాతిరంత ఎవ్వరితో రక్తి కట్టి పోతుందో
జనమంతా ఎవ్వరితో మనసు పంచు కుంటుందో
అతడే ఆ సకల బలుడుఅందరి కన్నా అతి పూజ్యుడు !

నిన్నటి రోజును కాలం తన్నేసుకు పోయింది
రేపన్నది  సంభవమే కాబోదని తోచింది
నేడొకటే నా గమ్యం చేరుచుననిపించింది !

ఎంత ఇచ్చి వేతుమో అంతటి  ధనవంతులం
ఎంత ఆపి పెడతామో అంతగ  పేదవారలం !

వసంతమూ వచ్చింది వెన్నెలా విరబూసింది
ఎన్నున్నా ఏం లాభం మనశ్శాంతి లేకుంది !

మధువును మనం త్రాగితే మరేం పరవా లేదు
మధువే మనల త్రాగితే మనకిక మోక్షం లేనే లేదు !

ఎంత పరమ శత్రువు నైనా ఎదుర్కొనడం సులభమే
స్నేహితుని కీర్ష్య కలిగినా దేవుడూ రక్షించడం కష్టమే !

మనిషి చేయు పాపాలెపుడు వాని పిల్లలను వెంటాడు
వారి బాధ చూడలేక వాని హృదయం కొట్టుమిట్టాడు !

ఎవరెలాంటి వారో ఎలా గుర్తు పట్టేది
అన్నీ మేలి ముసుగులే ఎవ్వని ఎత్తి చూసేది !

తమకై జీవించుట తప్పేమి కాకున్నను
తన వారి నేడ్పించుట తథ్యంగా తప్పేను !

వెంట వుండి దస్సిటిని కంట కాన లేని వాడు
తన చుట్టూ చీకటిని తానెలా చూడ గలడు !

మహనీయుల ప్రవచనాలు మహిత మార్గదర్శకాలు
విజ్ఞతతో వెన్నంటిన వెలుగునిండు జీవితాలు !

బూరెలలా పొంగినసూ పొలతి కంఠం బుగ్గలవి
గుచ్చుకనే పడినసూ గుంట లంపం సొట్టలవి !

విరబోసిన కురులా వెర్రెత్తించే జలపాతాలా
యువకుల నాకర్షించే యువతుల ఆహ్వానాలా ?

అడుగుల నీ సవ్వడి ఆ నీ కురుల ముడివిడి
ఆ చందం అందాలతో అంతగనా నీ దోపిడి!

భూమి పరిధి దాటి నేను పోతున్నానంతరిక్షం లోకి
పొగలే వీడనుకున్నా భగ భగ మంటను నేనై !

కృతఘ్ను నడగాలని కోరికగా ఉన్నది
నన్నేడిప్పిస్తే ఈ రీతిని 'తన కొరిగే దేమున్నది '?

ఇంకెక్కడి సాఖీ ఇంకా మధువెక్కడ
తెలివి తెచ్చుకో కాస్త జీవన సంధ్య మ్రింగనుంది !

కన్నీటితో గుండె గాయం కడుగుట సాధ్యం కాదు
ఆనందాల క్షణాలను అసలొదల బుద్ధికాదు !

బాధను మరచుటకై ప్రతి క్షణం నవ్వుతా నేను
చూచే వారేడుస్తారు సుంతయు వీడేడ్వడేమని !

పూలు లేని సమయమందు కొమ్మయునూ అందమే
ఆకారం పొందికైనదైతే అపుడే రంగయినా అందమే !

ఏ భాషలోనైనా ప్రేయసితో ప్రియ వచనాలందమే
అదే తెలుగులోనైతే అవేకాదు తిట్లూ తెగ అందమే !

కష్టాలెదురైనప్పుడు
కాపాడే వాడవసరం
ఊరడిల్ల కలిగించెడు
ఒడి ఒకటెంతో అవసరం !

ప్రియురాలి చక్కదనం
ముఖ్యమని అననేలేం
గుడ్డి ప్రేమికుడు మాత్రం
గొప్పగనే అవసరం !

గుండె ఎటుల ప్రేయసి
కురులలో చిక్కు కొనును
తలపై శరదృతువు
తారాడ వసంతాన !

అనంత హైటెక్ విజ్ఞానం
తగ్గించె దేశాల మధ్య దూరం
మనుష్యుల మధ్యనేమో
మరేలొకో సృష్టించెనగాధం !

యువకులుగా ఉన్నప్పుడు
మానవత మహిత ధ్యేయం
పెరుగుతూ పోతుంటేనో
పెడ దారులె అగు నాదర్శం !

అనుచరులకు నాయకుడు
అయి చూపాలాదర్శం
అవినీతి నాపోశనం పట్టువాడు
అంత మొందించ అర్హుడు!

ఇంట నేను దీపాన్ని
ఎల్లెడలా కాంతి పుంజాన్ని
నానా నాశన దారులవున్నా
నేనూ శాశ్వతత్వం చేరుతున్నా !

నిన్నటి పరమ మిత్రులు
నేటి బద్ధ శత్రువులు
ఇది కఠోర జీవిత సత్యం
కాదసలే ఉహాతీతం !

ద్రిమ్మరి లాగానే ఐనా దేశంలో
తిరిగి జీవిత కాలం విసిగి విసిగి వేసారింది
కాళ్ళు అడుగు వేయలేకున్నప్పుడు
'కవిగారి'కి దారి కళ్లకు కనిపించింది !

**శుభం**